రవీంద్ర సాహిత్యం

ప్రథమ ముద్రణ '58

卐

కృష్ణా ప్రెస్
విజయవాడ

卐

# రెండు ధ్యాస్వాయులు

## ఈ సంపుటిలో :

పూదోట

దృష్టిదానం

పెళ్ళికూతురు

జీవన్మరణాలు

# పూ దో ట

## 1

నీరజ వీపుకు ఆనించి, యెత్తుగా దిండ్లు పెట్టుకొని ఒక పక్కకు వొడ్డిగిలి, మంచాన పడివుంది. కాళ్ళమీది తెల్లని పట్టుశాలువా, లేమబ్బులక్రింద తదియనాటి చంద్రకాంతిలా వుంది. ఆమె శరీరము శంఖుమాదిరి పాలిపోయింది; గాజులు వదులు అయిపోయినవి; కండలేని చేతి నీలినరాలు కాంతు లీనుతున్నవి; జబ్బుమూలాన కనురెప్పలక్రిందా, పైనా కప్పు వేసింది.

ఆ గది తెల్లని చలువరాయి పరచబడ్డది. గోడమీద రామకృష్ణపరమహంస పటము వుంది. గదిలో మంచము, టీపాయి, రెండు పేము స్టూల్సు వున్నవి; ఒకమూలన చిలక కొయ్యవుంది. అంతకుమినహా పెద్దగా సామాను యేమీలేదు. మరొక మూలన, తలుపులుమూసిన ఆ గదిలో, యిత్తడి కుండీలోని పూగుత్తుల పరిమళాలు గుభాళిస్తున్నవి.

తూర్పువేపు కిటికీ తెరిచివుంది, అందులోనుంచి చుట్టూ జిలిబిలిగా అల్లుకున్న విష్ణుక్రాంత లతలతో, పూలతో ముచ్చటగొల్పే ఆర్కిడ్ పొదరిల్లు కన్పిస్తూవుంది. దానికి ఆనుకునే కొలను; అక్కడ పనిచేస్తున్న నీటిపంపులోంచి ధారాళంగా వస్తున్న నీరు, కాలవలగుండా పారుతూ మళ్ళ లోనికి పోతూవుంది. మామిడిపూత పరిమళాలతో నిండారిన అ మామిడి తోటలో కోయిల పరవశమై కూస్తూవుంది.

తోట సింహద్వారం దగ్గర, అ మండుటెండలో మధ్యాహ్నపు గంట గణగణ మోగింది. మూడు అయేవరకు తోట మాలీ లందరికి విశ్రాంతి! ఆ గంటమోతకి నీరజలో ఒకవిధ మైన వేదన కలిగింది; ఆమె మనసంతా వుదాసీన మయింది. పనిమనిషి తలుపు వేయటానికి వచ్చింది. కాని నీరజ 'అలానే వుండనివ్వ'మన్నది. ఆమె చెట్లకింద దోబూచులాడుతున్న వెలుగు నీడలవంక అలానే చూస్తూవుంది.

ఆమె భర్త ఆదిత్యుడు పూలవ్యాపారంలో మంచిపేరు గడించాడు. పెళ్ళినాటినుంచీ బహువిధాల విరాజిల్లుతున్న వారిద్దరి ప్రేమ, యీ తోటపనిలో కేంద్రీకృత మయింది. పూతోటలోని ప్రతిరెమ్మలో, ప్రతి పూవులో వారిద్దరి ఆనందము కొత్త సొబగులతో విలసిల్లుతూవుంది. విదేశాల్లోవున్న వారు, బంధుమిత్రుల జాబులకోసము యెదురు చూసినట్లే, ఆ దంపతులుకూడా వేర్వేరు ఋతువుల్లో పూసేపూలకోసము ఉవ్విళ్ళూరుతుండేవారు.

ఆమెకు యివాళ మాటిమాటికీ గతించిన విషయాలు తలపుకు వస్తున్నవి. అవి జరిగిపోయి ఎక్కువకాలం కాలేదు. కాని ఆమెకు, ఒక మహా ఎడారి ఆవల, యుగాలనాటి చరిత్రలా తోస్తూవుంది. తోటలో మడమటివేపు చివరన ఎప్పుడో పెట్టిన నిమ్మ ఉంది. దాని జతది చాలా రోజులకింద యెండి, పడిపోయింది, దాని బోదెతో చిన్న టేబులు చేయించారు. అక్కడే కూర్చుని ఇద్దరూ ఉదయము టీ తీసుకునేవారు. ఎండపొడలు చెట్ల సందులలోనుంచి వచ్చి, వారి పాదాల మీద పడుతుండేవి. గోరువంక, ఉడత తమ వలయుప్రసాదం

కోసం సిద్ధంగా వుండేవి! టీ తాగిన తర్వాత యిద్దరూ కలిసి తోటపని మొదలుపెట్టే వాళ్ళు. నీరజ పూలు అల్లిన పట్టు గొడుగు వేసుకొనేది; ఆదిత్యుడు కొమ్మలు కత్తిరించే పెద్ద కత్తెర నడుముకు తగిలించుకొని, తలమీద హాట్ పెట్టుకొనే వాడు. ఎవరైనా స్నేహితులు వస్తే, తోటపని చేసుకుంటూనే వ్యవహారాలు మాట్లాడుకొనేవారు.

"మీ ప్రెజెంటేషన్ను చూసి, మాకు కన్ను కుడుతూ వుంది. భాయీ!" అని తరచు స్నేహితులనోట వినిపించేది. కొంతమంది, పల్లెటూరువాళ్ళమాదిరి "యిది పొద్దుతిరుగుడు పూవా?" అనేవాళ్ళు. నీరజ కలకలనవ్వి "లేదు, లేదు. యిది బంతిపూవు" అని చెప్పేది. ఒకనాడు బోలెడు ప్రపంచాన్ని చూచిన మహాశయులొకరువచ్చి "యింత పెద్దపూలు పూసే బొండుమల్లె యెలా తయారు చేశావమ్మా! మీకు గారడీ తెలుసులావుంది. అది చూపులకి మరువం మాదిరి వుంది" అన్నాడు. ఆ విశేషజ్ఞుడికి నాలుగైదు అంట్లు యిచ్చి తగ్గ ప్రతిఫలం ముట్టజెప్పింది. ఇలా వచ్చే పోయే మిత్రులకు తెంపు వుండేదికాదు. స్నేహితులను వెంటపెట్టుకొని, పొదరింటి చుట్టూవున్న కాయగూరలు, పండ్లు, ఉన్న పూలతోటల్లోకి తిరుగుతుండేవారు. నీరజ ఆ వచ్చినవారు వెళ్ళేప్పుడు బుట్టనిండా కార్నేషన్, మాగసోలియా, గులాబీపూలు, నిమ్మ, బొప్పాయి వెలగకాయలు - పెట్టియిచ్చేది. ఈ తోటలోని వెలగకు ప్రత్యేకత వుంది. ఋతువునుబట్టి, చిట్టచివరకి కొబ్బరినీళ్ళు యిచ్చేవారు. తృప్తిగా పుచ్చుకుని "యీ కొబ్బరినీళ్ళు యెంతకమ్మగా వున్నాయి" అనేవాళ్ళు.

"ఈ కాయలు మా తోటలోవే!"

"అవును, అందుకనే అంత రుచిగావున్నాయి!"

నీరజ ఆ రోజులు తలచుకుని వుదాసీనురాలయేది; ముఖ్యంగా, ఉదయానే చెట్టుకిందకూచుని టీ తీసుకోవటమూ, కమ్మని వాసనవస్తున్న టీ పొగలతోపాటు ఆ సీజనులోని పూల సువాసనలు తలుపుకువచ్చి, దీర్ఘంగా నిట్టూర్చేది! మనసు ఆవురు మనిపించేది. బంగారు మలామాచేసిన ఆ దినాలను, భూతకాల రాక్షసుని పిడికిల్లోనుంచి లాక్కు రావా లనుకునేది. కాని ఆమెను ఎవరూయెరుసుపడరే! ఆమె పెద్దమనిషితరహాగా అదృష్టాన్ని శిరసావహించటానికి యెంతమాత్రమూ అంగీకరించదు. దీనికిబాధ్యులు యెవరు? విశ్వవ్యాప్తమైన యీ బాల్య చేష్టలేమిటి? యింతచక్కని పరిపూర్ణమైన సృష్టిని యిలా ఆకు మూడు చేసిన ఆ వున్మాది యెవరు?

వివాహమైనతర్వాత, పదిసంవత్సరాలు వొడుదుడుకులు లేకుండా జీవితం సుఖంగా గడిచిపోయింది. చెలికత్తెలు ఆమె అదృష్టానికి అసూయచెంది లోలోపల "మార్కెట్ రేటు కంటె ఆవిడ యెక్కువధరపలికిందని" అనుకునేవారు. స్నేహితులేమో ఆదిత్యుని 'లక్కీ డాగ్' అన్నారు.

ఒకనాడు హఠాత్తుగా పండంటి ఆమె సంసారనౌక కూలిపోవటానికి మూలము 'డాలీ' కుక్క! గృహలక్ష్మి రాక మునుపు, గృహయజమానికి చేదోడువాదోడు డాలీ యని చెప్పవచ్చు. చివరకి ఆ కుక్క భక్తిశ్రద్ధలు రెండుపాళ్ళు అయినవి. నీరజే దాని శ్రద్ధాభక్తులు యెక్కువగా చూరగొన్నది,

లోనికి వాహనమువస్తేసరి, డాలీ చిందులు తొక్కేది. తోక విసురుగా ఆడిస్తూ, కార్లు ప్రవేశించటానికి అభ్యంతరాన్ని తెలియజేసేది. యజమానురాలుగనుక వేలుచూపి, హెచ్చరించకపోతే పిలవకుండానే వాహనంలో యెగిరి దూకటానికి సన్నద్ధమయేది! ఆ పిమ్మట దీర్ఘంగా నిట్టూర్చి, నిరాశతో తోకముడచి ద్వారంవద్ద పడివుండేది. దంపతులు యింటికిరావటంలో ఆలస్యమయితే, తలపైకెత్తి మూజూస్తూ, కాలుకాలినట్టు అటూయిటూతిరుగుతూ, ఆకాశవాణివి జాలిగా 'ఇంకా రాలేదేం?' అని అడుగుతున్నట్టుండేది

ఒకనాడు అకస్మాత్తుగా డాలీకి పెద్ద జబ్బుచేసింది. అది దీనంగా వారిద్దరిముఖాలవంక చూస్తూ నీరజవొడిలో తలపెట్టి ప్రాణాలు వదిలింది.

ఆమెలోని ప్రేమస్రోతస్సు ఎప్పుడూ పొంగులు వారుతుంటుంది. ఈప్రేమకు వ్యతిరిక్తంగా ఆ పరమేశ్వరుని జోక్యాన్ని కూడ ఆమె వూహించలేకపోతూవుంది. ఇంతకాలము బంగారం లాంటి తమ సంసారాన్ని నమ్ముకుంటూ వచ్చింది. కాని నేడు అనుకోటానికి వీల్లేని డాలీ మరణం సంభవమయే టప్పటికి, తమ ప్రేమదుర్గానికి దెబ్బతగిలినట్టుంది. ఇది ఆమెకు సర్వనాశనం తెచ్చిపెట్టే అపశకునానికి ప్రవేశద్వారంలా వుంది. ఆ విశ్వబ్రహ్మ అస్థిరచిత్తుడు; అతను ప్రస్తుతం చూపే కనికరం కూడా నమ్మకోదగినది కా దనుకుంది.

ఇంతకాలంనుంచి నీరజకు ఒక్క నలుసుకూడా కలగలేదు. అనాధబాలు డొకడు ఆమెను ఆశ్రయించుకుని వుంటున్నాడు. ఆ కుర్రవాడి ప్రాపులో, నిబద్ధమైవున్న మాతృప్రేమ

ఉద్వేగితమయింది; ఆమె చూపే ప్రేమకు, కుర్రవాడు వుక్కిరి బిక్కిరి అయేవాడు. అప్పుడే నీరజకు సంతానయోగం కలిగే సూచనలు గోచరించినై. ఆమె హృదయం ప్రేమతో తొణికిస లాడింది; భవిష్యత్ కాలదిగంతము, నవజీవన ప్రభాతారుణ రేఖలతో ఆరక్తమయింది. ఆమె తోటలో చెట్లకిందకూచుని, పుట్టబోయే బిడ్డకోసం రకరకాల గుడ్డబొమ్మలు కుడుతూవుంది.

నవమాసాలు నిండినై, మంత్రసాని వచ్చింది; కేసు గడ్డుగావుంది. ఆదిత్యునికి కాళ్ళూచేతులు ఆడటంలేదు. అతని తొట్రుపాటు చూసి, డాక్టర్లు మందలించి, ఎడంగా పంపారు. చివరికి ఆపరేషనుచేశారు; తల్లికి గండంతప్పింది. కాని బిడ్డ దక్కలేదు. ఆ నాటినుంచి ఆమె మంచం పట్టింది. వైశాఖ మాసంలో యిసుకశయ్యలమీద జోగుతోవుండే నదివలె, నెత్తురుచుక్కలేని ఆమె దేహము మంచానికిఅంటుకుపోయింది; నానాటికి జీవశక్తి క్షీణిస్తూవుంది. మంచానికి యెదురుగావున్న కిటికీలోనుంచి సంపంగి, జాజి, మల్లెల సువాసనలు వెచ్చని గాలితో కలిసివచ్చి, గతించిన స్వర్ణదినాలనుగురించి ఆమెతో గుసగుసలాడి, యోగక్షేమాల నరసిపోతున్నవి.

ఆదిత్యుడు తోటపనులు చూడటానికి దూరపు బంధువుల పిల్ల సరళను తీసుకురావటం ఆమెను బాగానొప్పించింది. సరళ పూలగొడుగు వేసుకుని; కూలీలచేత పనిచేయిస్తూ, తోటలో తిరుగుతూండటం కిటికీలోగుండా చూస్తున్నప్పుడు, నీరజ ఎందుకూ కొరగాని తన జీవితాన్ని యేవగించుకునేది. ఈ సరళనే తను యిదివరకు అంట్లుపెట్టే ప్రతిసీజనులో పిలిపించేది. ప్రొద్దున్నే పని ప్రారంభమయేది. ఆతర్వాత స్నానము,

చెట్లకింద కూచుని అరటి ఆకుల్లో భోజనాలు చేయటం, గ్రామ ఫోను సంగీతం – అలా జరిగిపోయింది. తోటమాలీలుకూడా సుష్టుగా తిని, చింతచెట్టుకింద కూచుని లోకాభిరామాయణం చెప్పుకునేవాళ్ళు. పొద్దు యేటవాలగానే, చల్లగాలికి చెరువు నీరు ఉయ్యాలలూగేది; పొగడచెట్టుమీద పక్షులు కలకలా రావము చేస్తుండేవి. ఈ మాదిరిగా ఆనందపూరితమైన శ్రమతో రోజులు దొర్లిపోయినవి.

ఆమె హృదయంలోని మాధుర్యము కటువుగా ఎందుకు మారిపోయింది? ఇప్పటి శరీరదౌర్బల్యంమాదిరే యీ తీవ్ర నీరసస్వభావంకూడా అపరిచితమైనదే! అందులో దయాదాక్షిణ్యాలు కలికానికికూడా కానరావు. ఆమెకు ఒకసారి యీ దౌర్బల్యం కొట్టవచ్చినట్టు కన్పించేది; అప్పుడు యెంతో నొచ్చుకునేది. కాని తన మనస్సును అదుపులో పెట్టలేక పోయేది. ఇది భర్తకెంత యెక్కుడపడుతుందోనని భయపడేది–కభోదిపక్షి కోరిన పండు శుభకార్యాలకు పనికిరానిమాదిరి ఆమె మనస్సుకూడా మలినమైనట్టు వారికళ్ళకికట్టినట్టు తెలిసిపోతుందేమో!

గంట వినిపించగానే తోటమాలీలందరూ వెళ్ళిపోయారు. తోట బావురుమంటూవుంది. ఆమె చూపుమేర, దురాశా మృగతృష్ణకూడా కానరావటంలేదు; అంతటా నీడపొడలేని మండుటెండలో శూన్యత్వమే గోచరిస్తూవుంది.

## 2

నీరజ రోషనీని పిలిచింది.

మనిషి లోనికివచ్చింది. నడివయస్సు; జుట్టు అక్కడక్కడ నెరసింది. చేతులకు యిత్తడిమురుగులు; లంగామీద పమిటవేసుకుంది. బక్కపలచగా కట్టెలా వుంటుంది. ఎముకల పోగు. ఆ శరీరంతీరు, మొఖంమీది కాఠిన్యము చూస్తూంటే, వీరి కుటుంబవ్యవహారాల్ని గురించి తన న్యాయస్థానంలో ప్రతికూలంగా తీర్పు చెప్పబోతున్నదా అనిపిస్తుంది. ఆవిడ నీరజను తన చేతుల మీదగా సాకింది. ఆమె అంటే ప్రాణాలు విడుస్తుంది. ఆమెవద్దకి వచ్చేపోయేవారందరిమీదా– చివరికి నీరజభర్తనుకూడా– ఒక కంట కనిపెట్టివుంటుంది.

ఆవిడ గదిలోకివచ్చి "మంచినీళ్ళు యివ్వనా తల్లీ?" అంది.

"వద్దు, కూచో!"

పనిమనిషి నేలమీద చతికిలపడింది.

నీరజ మాట్లాడదామనే ఆవిణ్ణి పిలిచింది. పనిమనిషి, నీరజ స్వవిషయాలకు ఆంతరంగిక వాహనమని చెప్పవచ్చు.

"ఇవాళ పెందలకడనే తలుపుతీసిన అలికిడి విన్నానే!"

ఆ మనిషి యేమీ మాట్లాడలేదు; కాని ఆమె ముఖవైఖరినిబట్టి "వినని దెప్పుడు?" అనే భావం తెల్లమవుతూంది.

నీరజ మళ్ళీ అర్థంలేని ప్రశ్న వొకటి వేసింది–"సరళను వెంటబెట్టుకుని తోటలోకి వెళ్ళారేమో?" అంది.

ఈ విషయం ఆమెకు తెలిసినదే. కాని, రోజూ యిదే ప్రశ్న ! పనిమనిషి చేతులుతిప్పి, మూతివిరిచి, మెదలకుండా కూచుంది.

నీరజ వెలుపలకుచూస్తూ, చెప్పుకుపోతూవుంది-"వారు నన్ను కూడా చీకటితో లేపేవారు. తోటలో పనిచేయడానికి నేనూ వారితోకలిసి వెళ్ళేదాన్ని ! ఇది. యేనాటిమాటో కాదు ! నిన్న మొన్నటిది !"

ఇలాంటి ప్రసంగాల్లో యితరులు కల్పించుకోవటం ఆమెకు బొత్తిగా గిట్టదని ప్రతివారికీ తెలుసు. కాని ఆవిడ ఉండబట్టలేకపోయింది. "ఆ రాణీగారు రాకపోతే తోటంతా బీడు అయిపోయేదేమో !"

నీరజ అలానే చెప్పుకుపోయింది. "న్యూమార్కెటుకు ప్రొద్దున్నే పూలు పంపని రోజంటూ వుండేదికాదు. ఇవాళ కూడా అలానే బండి పోయినట్టుంది. ఇప్పుడు యీ పని ఎవరు చూస్తున్నారు రోషనీ ?"

రోషనీ అందరూ యెరిగిన యీ విషయానికి సమాధాన మివ్వకుండా పెదవి విరిచింది.

"నేను చూస్తున్నంతకాలమూ తోటమాలీలు దొంగతనమనేది యెరగరు."

ఆవిడ దుఃఖాన్ని దిగమింగి-"ఆ రోజులుమళ్ళీవస్తవా? యిప్పుడు పట్టపగలు రెండుచేతులా దోపిడి సాగుతూంది" అంది.

"అలానా !"

"నేను పట్టిమాటలు చెపుతున్నా ననుకుంటున్నారా? ఇక్కడనుంచి పంపే పూలు, మార్కెటుదాకా చేరు తున్నయ్యా! బాబుగారు బయటికి అడుగుపెట్టటం ఆలస్యం, దొడ్డివాకిట్లో మాలీల మార్కెటు వెలుస్తుంది!"

"ఎవరూ పట్టించుకోవడంలా?"

"ఎవడికి పట్టింది అమ్మగారూ?"

"బాబుగారితో నువ్వెందుకు చెప్పవు?"

"నేనెవరిని – చెప్పటానికి? ఎవరి మర్యాద వాళ్ళకే ఉంటుంది. అంతా మీదేనాయె, మీరెందుకు చెప్పరూ?"

"పోనివ్వు, మనకెందుకు? సర్వనాశనమయే రోజున తెలిసివస్తుంది. తల్లిప్రేమకంటే, సవతిప్రేమ దొడ్డది కాదని యేదో యొకనాటికి ఆకళింపు కాకపోతుందా? నీ కేంపట్టింది. చూసీచూడనట్టు వూరుకో!"

"కానీ అమ్మగారూ, నేను ముందే చెపుతున్నా, మీ హరియా తోటమాలి, పనికి మనిషి కాదు."

వాడిమీద ఆవిడకోపానికి కారణం, పనికి దొంగవటమే కాదు; ఇచ్చకాలాడి నీరజవద్ద మితిలేని మెప్పు సంపాదిస్తు న్నాడు.

"నేను మాలీల తప్పనను. మాలీలు కొత్తపెత్తనం యెలాసహిస్తారు? వాళ్ళు తరతరాలనుంచీ తోటపనిచేస్తున్నారు. కొత్తయజమానురాలిది పుస్తకజ్ఞానము – యిష్టమొచ్చినట్లు ఆర్డర్లు పంపుతుంటే, పని యెలా జరుగుతుంది? తలా తోకా లేని ఉత్తరువులను పాటించటం హరియాకి గిట్టదు. వాడు నా

వద్దకువచ్చి గోలపెడతాడు విసీ. వినసట్టు నీపని నీవుచూచుకో మని చెపుతుంటాను ..."

"ఒకనాడు బాబుగారు బయటికి గెంటబోయారు."

"ఏం! యెందుకని?"

"వాడు కూర్చుని బీడీ కాల్చుకొంటున్నాడు, ఒక ఆవు పడి, మొక్కలు తినివేస్తూవుంది. 'లేచివెళ్ళి, ఆవును బయటకి కొట్టవేం?' అన్నారు బాబుగారు. 'నేను బయటికి తోలేదా ఆవుని? అదే నన్ను బయటికి తోలేటట్టుంది! ప్రాణాలంటే, అందరకూ తీపివుంటుంది బాబుగారూ' అని నిర్మొహమాటంగా చెప్పాడు. ఆ మీదట బాబుగారికి కోపంవచ్చింది."

నీరజ నవ్వి – "వాడి మాటతీరే అంత! ఏమయినా, వాడిని నా చేతులమీదుగా మనిషిని చేశాను." అంది.

"బాబుగారు మీ మొహం చూచి, వూరుకుంటున్నారు. గొడ్లుపడి తోట ఆకుమూడు చేస్తే వాడిదేమి పోయింది? వాణ్ణి యిలా నెత్తి కెక్కించుకోవటం, నాకు బొత్తిగా గిట్టదు."

"నీవు అలా ఊరుకో రోషనీ, వాడు గొడ్లను ఎందుకు తోలందీ, వాడి అంతర్యామికే ఎరుక! నాకు సమస్తం తెలుసు. వాడికి కడుపు తరుక్కుపోతూ వుంది. అడుగో వెళ్తున్నాడు; ఇటు పిలువు!"

పనిమనిషి కేకవిని, హరియా తిరిగివచ్చాడు!

"ఏమిరా, ఇవాళ కొత్త ఆర్డరు ఏమైనా వచ్చిందా?" అని అడిగింది నీరజ.

"రాకుండావుంటుందీ! వింటుంటే, నవ్వూ వస్తుంది; మనస్సుకు నొప్పిగానూ వుంటుంది."

"అర్థరేమిటో చెప్పు, విందాము."

"ఎదురుగా పడగొట్టే యింట్లోనుంచి రాళ్ళు తెచ్చి, చెట్లకింద పరచమన్నారు. ఈ వేళటప్పుడు చెట్లు ఎండదెబ్బ తింటవని చెప్పాను. కాని ఆలకించే నాథుడేడీ?"

"బాబుగారితో చెప్పకపోయావా?"

"చెప్పాను. వారు నన్నే చీవాట్లు పెట్టారు, ఇక నాకు సెలవు దయచేయించండి అమ్మగారూ, నావల్లకాదు"

"ఊఁ- రబ్బిషు మోసుకురావటము నేను చూస్తూనే వున్నా."

"మొదటినుంచీ మీ చేతికింద పనిచేస్తూవచ్చాను. మీ కంటిముందే, నా సిగ్గుతీసేశారు. సాటివాళ్ళలో నే నెలా తలెత్తుకుతిరగను? నన్ను కులంలోనుంచి వెలివేయరూ? మీరే చెప్పండి - నేను రోజుకూలీనా, అమ్మగారూ?"

"సరే, ఇక వెళ్ళు. ఇటుకరాయి యెవరైనా నిన్ను మోసుకురమ్మంటే, వద్దన్నానని నా పేరు చెప్పు. ఏం ఇంకా నిలబడ్డావు?"

"ఇంటిదగ్గరనుంచి వుత్తరం వచ్చింది, కాడి జతఎద్దు ఒకటి చనిపోయిందట!" అని చెప్పి, హరియా తల గోక్కుం టున్నాడు.

"లేదు, చనిపోయివుండదు! నా మాదిరే దానిదీ అవిటి బ్రతుకేమో! నీ సోది మాని, రెండురూపాయలు పట్టుకెళ్ళు"

అని, టీపాయిమీాదవున్న యిత్తడిబాక్సులోనుంచి, డబ్బు తీసి యిచ్చింది.

"ఇంకా యేం కావాలి?"

"మా వాళ్ళకి వొక పాతచీర యిప్పించండి, మీా పేరు చెప్పుకుంటా"రని, ఆకువక్కలతో గారబట్టిన పళ్ళుఇకిలించాడు.

"రోషనీ, ఆ చిలకకొయ్యమీాద చీరతీసివ్వు వాడికి"

ఆవిడ గట్టిగా తలవూపుతూ – ఎందుకివ్వాలి – అది ఢకా నేతచీర." అంది.

అయితేమరా నె, ఇప్పుడు నాకు చీరలన్నీ వొకటే; ఇంకా యెవరు కట్టుకోను?"

రోషనీ మొహం చిట్లించుకుని–"లేదు, వీల్లేదు. అంతగా యివ్వాలనుకుంటే, ఎర్రంచు మిల్లుచీరె యివ్వండి. ఇటు చూడు హరియా, అమ్మగారిని యిలా పీడించుకు తిన్నావా, బాబుగారిచేత నీకు ఉద్వాసన చెప్పించితీరుతాను" అంది.

హరియా నీరజ పాదాలురెండూ తాకి – "నా వ్రాత అమ్మగారూ" అని యేడుపు మొదలెట్టాడు.

"ఎందుకు ఏడుస్తావు – దేనికిరా!"

"చిన్నతనంలోనే మా అమ్మపోయింది. అప్పటినుంచీ యీామెనే మా కన్నతల్లి అనుకుంటున్నాను – చూడండి అమ్మగారూ, మీారు నా మీాద కనికరంచూపుతుంటే, అడ్డుపుల్ల వేస్తూంది. ఒకరి ననేపనేముంది, నా వ్రాతేఅంత! లేకపోతే, యీా హరియాని పరాయివాళ్ళ దయాదాక్షిణ్యాలకు వదిలి, యిలా మంచాన పడివుండేవాళ్ళా?"

"అంత భయపడిపోతావు దేనికిరా? రోషనీకి నీవంటే లోపల యిష్టమే! నీవు వచ్చేముందే, నిన్ను పొగుడుతూ వుంది. రోషనీ, యివ్వు, యివ్వు! తీసుకెళ్ళనిదే వాడు యిక్కడినుంచి కదులుతాడా – మోడీవేసుకు కూచుంటాడు"

ఆవిడ అయిష్టంగానే చీరతెచ్చి హరియాముందు పడేసింది. వాడు చీరతీసుకుని, యజమానురాలికి చేతులు జోడించి "మురికిచేతులు; యీ టవల్లో చుట్టుకు వెళ్ళతాను" అని, ఆమె అనుమతికోసము చూడకుండానే, చిలకకొయ్యమీద టవల్లో చీర చుట్టుకుని వెళ్ళిపోయాడు పెద్ద పెద్దఅంగలు వేస్తూ–

"రోషనీ, బాబుగారు బయటికి వెళ్ళారని నీకు గట్టిగా తెలుసా?"

"ఆదరా బాదరా పోవటం నా కళ్ళారా చూశాను. ఆ తొందరలో టోపీకూడా మరిచిపోయారు."

"ప్రొద్దున్నే వారు నాకు పూలుయివ్వకుండా వెళ్ళటం యిదే మొదటిసారి! నెమ్మదిగా యిలానే అశ్రద్ధ యెక్కువవుతుంది. చివరికి వెలిబూడిద పారబోసే పెంటకుప్పే నాకు శరణ్యం."

సరళ రావటంచూసి, రోషనీ మాటివిరిచి వెళ్ళిపోయింది.

సరళ చేతిలో ఆర్కిడ్ పువ్వుండుంది. ఆ తెల్లనిపూరెబ్బల మీది వంకాయరంగు చార, రెక్కలు విప్పుకుని కూచున్న సీతాకోకచిలుకలా వుంది. సరళ పొడగరి, చామనచాయ; కాని సుకుమార శరీరం; కాంతులీను, విశాలమైన ఆమె కరుణాపూరిత నేత్రాలమీదికి మొట్టమొదటగా చూపరుల

దృష్టిపోతుంది. ముతక ఖాదీచీరె కట్టుకుంది. అదోరకంగావున్న జారుముడి భుజాలమీద పడుతూంది. అలంకరించని దేహా పాటవము, యౌవన ప్రాదుర్భావాన్ని నిరాదరించినట్టుంది.

నీరజ ఆమె మోమువంక చూసింది. సరళ నెమ్మదిగా పూవు తెచ్చి పక్కమీద పెట్టింది.

నీరజ తన కోపాన్ని కప్పిపుచ్చుకుండానే-"నిన్ను ఎవరు తెమ్మన్నారు?" అని అడిగింది.

"ఆదిత్యభాయీ!"

"తనెందుకు రాలేదు?"

"మార్కెటుకు అర్జంటుగా వెళ్ళాలసి వచ్చింది."

"పనేమిటి?"

"రాత్రి ఆఫీసు తాళాలు పగలకొట్టి దొంగలుపడ్డారు"

"ఇక్కడకు వచ్చిపోవటానికి అయిదునిమిషాలైనా తీరిక చిక్కలేదా?"

"రాత్రంతా మీకు బాధయెక్కువగావుండి, తెల్లవారు జామున కొంచెం కునుకుపట్టింది. మిమ్మల్ని లేవటమెందుకని వాకిట్లోకివచ్చి తిరిగివెళ్ళారు. మధ్యాహ్నందాకా రావటం పడకపోతే, నన్ను యీ పువ్వు మీ కివ్వమన్నారు"

ఆదిత్యుడు రోజూ వుదయం తోటపని ప్రారంభించే ముందు, ఒక చక్కని పూవు తెచ్చి, యిచ్చేవాడు. నీరజ ప్రతి నిత్యము అతని రాకకోసం యెదురుచూస్తూంటుంది. ఇవాళ ఆపూవు సరళచేతిమీదుగాపంపాడు. తనచేతిమీదుగా పూవు యివ్వటంలోనే విలువ ఉంటుందని ఆయనకు గ్రహింపు లేక పోయింది! పంపులోదీ గంగాజలమే. కాని ఆ పవిత్రత

యెక్కడనుంచి వస్తుంది ? నీరజ ఆ పూవును యీసడింపుతో పక్కకు నెట్టివేసింది. "దీని బజారుధర యెంత ఉంటుందో తెలుసా ? అక్కడికేవం పు; వృథాగా పాడుచేయడం దేనికి?" అని చెపుతుండగానే ఆమె కంఠం గద్గదమయింది.

సరళకు విషయం అర్థమయింది. సమాధానపరచటానికి ప్రయత్నిస్తే, యింకా నొప్పించి నట్లవుతుందని మెదలకుండా నిలబడింది.

నీరజ కొంచెం ఆగి–"యీ పూవుపేరేమిటో తెలుసా? అని అడిగింది వూరుకోలేక.

తెలియదని చెపితేపోయేది కాని ఆమె ఆత్మాభిమానానికి దెబ్బ తగిలినట్లుంది. "ఎమారిలిస్ !"

నీరజ వూరికే కోపగించుకుని గద్దిస్తూ – "పెద్ద తెలిసినావిడవు బయలుదేరావు ! ఇది గ్రాండిఫ్లోరా !" అంది.

సరళ నవ్వి – "కావచ్చు ! అంది"

"కావచ్చేమిటి ? అయితేను ! నాకు తెలియదని నీ ఉద్దేశ్యమా ?"

ఆమె కావాలని కాని పేరుచెప్పి, తనమాట కొట్టివేస్తుందని సరళకు తెలుసు ! ఇతరులను నొప్పించి సంతృప్తి చెందటానికి ప్రయత్నిస్తూంది – ఆమె పరాజయాన్ని అంగీకరించి అడుగులో అడుగు వేస్తూ వెళుతుంటే నీరజ ఆమెను ఆపి – "ప్రొద్దుటినుంచీ ఏంచేశావు ? యిదివరదాకా యెక్కడున్నావు ?" అంది.

"పొదరింటో"

నీరజ ఉత్తేజితురాలైంది – "మాట మాట్లాడితే, పొదరిల్లు! అక్కడేం మునిగిపోయిందని?"

"ఆర్కిడ్లు కొత్తవి పెట్టమని చెప్పివెళ్ళారు."

"నీవైతే, అంతా వల్లకాడుచేసి వదలిపెడతావు. నేను హరియాకు స్వయంగా అంతా నేర్పి ఉంచాను. వాడికిచెపితే యీ పనంతా చక్కగా చేయడూ?"

దీనిని కాదనటానికి వీల్లేదు. నీరజ చేతిక్రింద హరియా పని బాగాచేసేవాడే కాని యీ బాధ్యత సరళచేత పెట్టిన దగ్గరనుంచీ; వాడు పనికి దొంగఅయ్యాడు. పైగా పట్టీపట్టనట్టు చేస్తూ, చీటికిమాటికి సరళను కించపరుస్తున్నాడు.

ఇప్పుడు పని యెగగొడితే గాని, పాత యజమానురాలికి సంతృప్తిగా వుండదని హరియా గ్రహించాడు. కాలేజీ చదువులు బహిష్కరించి 'ప్యాసు' కాకపోవడమే, డిగ్రీ సంపాదించిన దానికంటె విలువ ఎక్కువ – అన్నమాదిరిగావుంది!

సరళకు కోపం రావలసిందే; కాని రాలేదు. నీరజ మనసు పచ్చిపుండులావుందని ఆమెకు తెలుసు. సంతానవిహీనురాలైన ఆమె మాతృహృదయాన్ని యీపూదోట పెనవేసుకు పోయింది. ఇంతసమీపానవున్న యీపూదోటలో విహరించే భాగ్యానికికూడా ఆమెనోచుకోలేదు; వెలిఅయింది. కళ్ళయెదుట యెంతదారుణమైన యెడబాటు!

"మూసివెయ్ ఆ కిటికీ."

సరళ కిటికీ మూసి "నారింజరసం తీసుకురానా?"అంది.

"వద్దు, తేఁకక్కరలేదు. ఇక నీవు వెళ్ళవచ్చు!"

సరళ జంకుతూ – "మకరధ్వజం పుచ్చుకునే వేళ అయింది." అన్నది.

"లేదు, అవసరంలేదు. నీకు తోటపని యేమైనా అప్పగించారా?"

"ఆఁ – గులాబి అంట్లు తొక్కమన్నారు."

నీరజ కొంచెం వెటకారంగా – "అంట్లకు సీజను యిదే కాబోలు! వారికి యీ సలహా యెవరు చెప్పినట్టు?" అంది.

సరళ తగ్గుగొంతుతో – "వందలువందలు ఆర్డర్లువచ్చినవని, వారే వర్షాలకుముందు అంట్లు తీయాలన్నారు – నేను వారించానుకూడా" అంది.

"వారించావా! మంచిపనిచేశావు! సరే హరియాని నావద్దకి పంపు!"

హరియా వచ్చాడు.

"నీ విప్పుడు బొత్తిగా దొరవైపోయావు! అంట్లు తొక్కితే, చేతులు మంటలా? కొత్తఅమ్మగారు నీ అసిస్టెంటు తోటమాలి, యేం! బాబుగారు వచ్చేటప్పటికి వీలైనన్ని అంట్లు తొక్కాలి. ఇవాళ మీకు రెస్టులేదు; విన్నావా! ఎండు గరిక, యిసుక కలిపి నేల చదునుచేయి!"

నీరజ యిక్కడ పడుకునే, అంట్లపని పూర్తిచేయాలని లోలోపల పంతం పట్టింది. పావం హరియా గొంతుమీదికి వచ్చింది!

హరియా లేనినవ్వు తెచ్చిపెట్టుకుని–"అమ్మగారూ, ఇత్తడి పూలకుండీ వుంది. కటక్‌లో తయారు – దీని విలువ మీకు గాని తెలియదు. ఈ గదిలో పెట్టతగినది!" అనిచెప్పాడు.

"ధర యెంత?"

హారియా నాలుక దంతాలమధ్య యిరికించి – "అలా అనకండి అమ్మగారూ, నేను మీదగ్గర ఖరీదు తీసుకుంటానా? డబ్బుకుపేదని కాని గుణానికి కాదు! మీ ఉప్పుపులుసు తిని కాదూ, బతికి బట్టకడుతుంది!"

హారియా పాత కుండీలోనుంచి పూలుతీసి, కొత్త కుండీలో సర్దసాగాడు. వెళ్తూ వెళ్తూ వెనుదిరిగి – "ముందే చెప్పి వుంచుతున్నా అమ్మగారూ, మా మేనకోడలి పెళ్ళికి బాజూబందులు యివ్వాలి; మరచిపోయేరు! గిల్టువి యిస్తే మీకే అపకీర్తి! ఇంత దొడ్డ లోగిట్లో తోటమాలిని – మా యింట్లో పెళ్ళికి, మీరు యేంసగలు పెడతారోనని వూరంతా యెదురుచూస్తూ వుంద" అని చెప్పాడు.

"సరే, అప్పుడే యేం తొందర వచ్చింది? నీ పని చూసుకో."

నాడు వెళ్ళిపోయాడు. నీరజ పక్కకు వొత్తిగిలింది. ఆమెకు మనసంతా మెలికలు తిరిగిపోతున్నట్టుంది – "రోషనీ, నేను ఒకొక మెట్టే దిగజారిపోతున్నాను; నా మనసు కూడా హారియా స్థితిలోకి పోతూవుంది."

"ఛీ, అలా అనుకుంటావేం తల్లీ!"

నీరజ స్వగతంలా చెప్పుకుపోతూవుంది–"నా దురదృష్టం నన్ను నలుగురిలో నగుబాట్లుపాలు చేసిందిసరే, మానసికంగా కూడా యింత హీనస్థితికి దించిందేమిటి? హారియా నన్ను యేదృష్టితో చూసేదీ నాకు తెలియదూ? నా మనసుకునచ్చే కబుర్లుచెప్పి, నవ్వుకుంటూ యేదోవొకటి చేతబట్టుకు వెళ్ళు

తున్నాడు. వాడిని యిలా పిలువు. బుద్ధివచ్చేటట్టు తలవాయ చీవాట్లు పెడతాను."

పనిమనిషి లేచి పిలుచుకు రాబోతుంటే – "యివాళ వద్దులే, పోనివ్వు" అంది నీరజ.

# 3

కాసేపటికి ఆదిత్యుని పెదతండ్రి కొడుకు రమేశు వచ్చాడు. "వదినా, అన్నాయికి యీ పూట ఆఫీసులో తెమలని పనివుంది. ఇంటికి వచ్చేటప్పటికి ఆలస్యమవుతుంది. హోటల్లో భోంచేస్తానని చెప్పి రమ్మన్నాడు."

నీరజ ముసిముసి నవ్వులు నవ్వుతూ– "కబురుసాకుతో పడుతూ లేస్తూ వచ్చావా మరిదీ! ఆఫీసునౌకరు యేమై పోయాడు?" అంది.

"నీ దగ్గరికి రావటానికి నీవుకాక మరోసాకు దేనికి వదినా? దాంపత్యంలోని సాధక బాధకాలు నౌకరుకి యే మర్థ మవుతవి?"

"ఇచ్చకాలు దేనికి బాబూ! దారితప్పి యిటువచ్చావు. నీ మాలిని యివాళ యేకాకిగావుంది; వెళ్ళిసముదాయించు!"

"ముందు వనలక్ష్మికి కానుక చెల్లించనివ్వు; ఆ పిమ్మట మాలినికోసం అన్వేషణ!" అంటూ, జేబులోనుంచి కథల పుస్తకంతీసి, నీరజ చేతికిచ్చాడు.

నీరజ సంతోషంతో – "అశ్రుశృంఖలాలు! నాకు యిలాంటిపుస్తకాలే యిప్పుడు అవసరం! సరే మరదీ, నా ఆశీర్వచనం చెవినివేసుకువెళ్ళు. కల్పనాలోక సహచరి, స్వప్న సంగిని అంటుంటావే, ఆ పూదోటమాలిని సర్వదా నీహృదయ

సామీప్యంలో ప్రమోదానంద శృంఖలాలతో బంధింపబడి వుంటుంది! ఎంత అదృష్టం!" అంది.

రమేశు వున్నట్టుండి–"వదినా, నే నొకమాట అడుగు తాను, తిన్నగా జవాబు చెపుతావా?" అన్నాడు.

"ఏమి టా మాట?"

"సరళ, నీవు కీచులాడుకున్నారా?"

"ఏం, అలా అడిగావు?"

"కొలనుదరిని సరళ నిశ్శబ్దంగా కూచునివుంది. స్త్రీలకు పురుషులమాదిరి పనిలేకుండా వుండటం బొత్తిగా గిట్టదు. సరళ యిలా వూరికే కూచోవటం నే నెన్నడూ చూడలేదు. 'యివాళ మనసు యెక్కడ వదలిపెట్టి వచ్చావ'ని అడిగాను. 'వడగాలి యెండుటాకుల్ని తీసుకెళ్ళే తావున' అంది. 'పొడువు కథలు దేనికి, స్పష్టంగా చెప్పగూడదా?' అన్నాను. 'మాట లన్నిటికీ భావవుంటుందా?' అని మళ్ళీ అదే ధోరణిలో జవాబు! అబలాహృదయాన్ని వ్రయ్యలుచేసిన కఠినాత్ముడు యెవరూ' అనే గేయం గుర్తుకొచ్చింది"

"మీ అన్నా యికాక నురెవరు?"

"ముమ్మాటికీ కాదు. అన్నా యిలాంటి పురుషులు మిగతామాలీలమీద విరుచుకుపడవచ్చు. కాని 'పుష్పరాశిలో అగ్ని' యిది జరిగే పనా?"

"మంచిది, యీ కొరగాని మాటలకేంగాని, పనికివచ్చే మాట వొకటి చెపుతా విను మరిదీ; నా మీదవొట్టే! సరళని పెళ్ళిచేసుకో! నా మాట నిలబెట్టాలి యీ వొక్కసారికీ! పెళ్ళి డుకువచ్చిన పిల్లను వుద్ధరించటం, మహాపుణ్యకార్యం మరిదీ!"

"పుణ్యమంటే వుబలాటంలేదు. కాని యీ పిల్ల మీాది వ్యామోహంతో, వివాహపుపోటీలలో నే నెవరికంటేను వెనక బడనని ఘంటాపథంగా చెపుతాను."

"మరి యింకా అడ్డేమిటి? సరళకు యిష్టంలేదా?"

"సరళను నే నెన్నడూ అడిగిచూడలేదు. ఆమె నా స్వప్నసంగిని కాని వాస్తవప్రపంచ సహచారిని కాదని చెప్పానుగా వదినా!

నీరజ హఠాత్తుగా రమేశు చేయి వొడిసి పట్టుకుని గట్టిగా నొక్కుతూ—"ఎందుకుకాదు మరిదీ, అయితీరుతుంది. చనిపోయేముందు మీా యిద్దరిపెళ్ళి చూచిపోతాను; లేక పోతే భూతమై నిన్ను పీడించుకుతింటాను." అంది.

నీరజ తడబాటు చూచి, రమేశు నిర్విణ్ణుడయ్యాడు. కాసేపు ఆమె మోమువంకచూచి తలవూపి—"నేను చుట్టరికంలో చిన్న. కాని వయిసుకు పెద్ద. గాలికి తీగవిత్తనాలు ననాయాసంగా కొట్టుకుపోతాయి; కాని గోధుమ మొక్కలతోపాటు వేరూగినాక వాటిని నిర్మూలించడం తలకుమించిన పని" అని చెప్పాడు.

నాకు చెప్పనక్కరలేదు మరదీ! నీకు పూజ్యురాలిని మాట దక్కించు. ఆలసించకుండా, పెళ్ళి చేసుకో. ఈ ఫాల్గుణమాసంలో లగ్నాలువున్నవి. మంచిరోజు చూపించు!"

నా పంచాంగంలో మూడువందల అరవై అయిదు రోజులూ మంచివే! ఒక్కసారి జైలుయాత్ర చేశాను; మళ్ళీ కృష్ణజన్మస్థానప్రాప్తి లక్షణాలు గోచరిస్తున్నవి. ఆ మర్గాన

వివాహదేవతలే కాదు; వారి అనుచరులుకూడా అడుగుపెట్టరు ఆ చాయల."

"ఈ కాలపు ఆడపిల్లలుమాత్రం జైలంటే భయపడుతున్నారా ?"

"భయపడకపోవచ్చు కాని సత్పవదికి మార్గం అదికాదు. ఆ మార్గంలో వధువును బ్రహ్మముడితో కాదు; మనసులో బంధించివుంచటమే ఉత్తమం! నేనూ అదే చేస్తాను."

సరళ హార్లిక్సు - పాలు తెచ్చి, టీపాయిమీద పెట్టి తిరిగి వెళ్ళిపోతూవుంది.

"వెళ్ళమాకు సరళా! ఈ ఫోటో యెవరిదో గుర్తించగలవూ ?" అంది నీరజ.

"నాదే !"

"ఈ ఫోటో మీరిద్దరూ పెత్తండ్రి తోటలో పనిచేసే నాటిది అప్పటికి నీకు పదిహేను, పదహారేళ్ళ ఈడువుంటుంది. మహారాష్ట్రులమాదిరిగ చీరె కట్టుకున్నావు"

"ఇది మీా కెక్కడ దొరికింది ?"

"వారి సొరుగులో చూశాను. అప్పుడు అంత ఆలోచనపోలేదు - ఇవాళ తెప్పించాను, ఏం మరదీ, అప్పటికంటె సరళ అందంగాలేదూ ?"

"అప్పటికి సరళ ఉందనికూడా నాకు తెలియదు. ఇంకా యెవరితో పోల్చను ? నాకు యిప్పటి సరళే పదహారణాల వాస్తవం !"

"ఇప్పటి మోము మనస్సులోని యేదోవొక రహస్యంతో ఆచ్ఛాదితమైనట్టుంది. తెల్లని మేఘాలు యివాళ

శ్రావణమాసపు వర్షాన్ని ప్రారంభించబోతున్న మాదిరివుంది. దీన్నే మీరు 'రొమాంటిక్' అంటారు. అంతేనా మరిదీ?"

సరళ వెళ్ళబోయింది కాని మళ్ళీ నీరజ ఆపింది. "కూచో సరళా! మరిదీ! ఒక పర్యాయం సరళను పురుషుల దృష్టితో చూస్తాను. సరే, నువే చెప్పచూద్దాం, ముందుగా మనచూపు ఎటుపోతుంది?"

"అంతటా!"

"కాదు, ముందు మనదృష్టి ఆమె నేత్రాలమీదికి పోయి, అక్కడే నిలిచిపోతుంది; ఆ నేత్రాల్లో ఒకవిధమైన గంభీరత పుట్టిపుడుతూంది. ఆమె చూపులు చూడముచ్చటగా వుంటవి. లేదు, లేదు. పారిపోమాకు సరళా, కొంచెం కూచో, శరీరము చూడు, యెంత నాజూగ్గా, సుకుమారంగా వుందో! చక్కని దేహ పాటవం!"

"వదినా, నీవు సరళని వేలానికి పెట్టదలచుకున్నావా? ఇవతల వుత్సాహానికి కొదవలేదని నీకూ తెలుసు!"

నీరజ దళారి వుత్సాహంతో చెపుతూంది–"చేతులు చూడుమరిదీ, అదొకగా, దృఢంగా, కోమలంగా వున్నవి. వ్రేళ్ళుచూడు, యెంత ముద్దొస్తున్నవో! ఇలాంటి సౌందర్యం ఎక్కడైనా చూశావా?"

రమేశు నవ్వి–"ముఖస్తుతి అంటారేమోనని చెప్పటానికి సంకోచిస్తున్నాను వదినా!" అన్నాడు.

"ఆ ముద్దొచ్చే చేతులు నీసొత్తని అనిపించుకోరాదూ?"

"ఎప్పటికీ కాకపోతే యేం వదినా? టీకోసం వచ్చినపుడు యీ చేతులతోటే అంతకంటె మధురానుభూతి లభి

స్తుంది. ఆ రసగ్రహణంలో కొద్దో గొప్పో వుండే పాణిగ్రహణ సంబంధచాయలే గుణ దురదృష్టవంతుని పాలిటి పెన్నిధి!”

సరళ లేచి, వాకిట్లో అడుగుపెట్టింది. రమేశు దారికి అడ్డునిలిచి – “నాకొక మాటయిస్తే కాని, దారివదలను సరళా!” అన్నాడు.

“ఏమిటి చెప్పు?”

“ఇవాళ శుక్ల చతుర్దశి. నేను బాటసారిగా పూదోట లోనికి వస్తాను; జెప్పదగిన విషయమేదైనా జరిగినప్పటికీ, నా చెవిని వేయనక్కరలేదు. దుర్భిక్షం దాపరించింది – దర్శనా లందటమే గగనమైపోయింది. సంభాషణకి అవకాశ మెక్కడ? యాదృచ్ఛికంగా యీ గదిలో ముష్టిభిక్ష లభించింది కాని మనసుకు సంతుష్టి లేదు. ఇవాళ నీ పూదోటలో ఏదైనా చెట్టు కింద కూచుని తనివిదీర దర్శనభాగ్యం అందుకోవాలి!”

సరళ సహజస్వరంలో – “మంచిది. అలానేరా!” అంది.

రమేశు నీరజ పక్కదగ్గరకి వెళ్ళి – “సెలవు యిప్పించు వదినా!” అన్నాడు.

“ఇంకా ఆగే అవసర మేముంది! వదినవల్ల కావలసిన పని తీరిపోయె!”

రమేశు వెళ్ళిపోయాడు.

## 4

రమేశు వెళ్ళినతర్వాత, నీరజ రెండుచేతులా ముఖం కప్పుకుని పడుకునివుంది. మనసును వున్మాదపరిచే రోజులు తనూ చూసింది; ఎన్ని వసంతకాలరాత్రులను సుఖంలో ముంచి

మెత్తలేదు? ప్రపంచంలోని ముప్పాతికవంతు స్త్రీలమాదిరి భర్త యింటివస్తువులజాతిలో జమపడిందా తను? పక్కమీద పడుకుని వొకొక్కటి పూసగుచ్చినట్టు యెన్నోవిషయాలు తలుపుకు వస్తున్నవి. భర్త ఆమె ముంగురులు లాగి, గద్గద కంఠంతో 'నా విలాసమందిరం సాకీ' అని పలిచేవాడు. గత పది వసంతాల్లో ఆ చెన్ను, తరగలేదు కాని అప్పుడు పానపాత్ర మద్యంతో నిండివుండేది. ఆమెభర్త అంటూండేవారు – "పూర్వం స్త్రీలపాదాలు తగలగానే అశోకాలు పుష్పించేవట! నా పూదోటలో కాళిదాసు కాలం కట్టువడిపోయింది. నీ పాదాలు సోకినదారికి యిరువైపులా రంగురంగులపూలు విరియ బూస్తున్నవి. వసంతకాలంలో నీవు మద్యం చిలకరిస్తావు కాబోలు, గులాబులు తన్మయత్వంతో వుయ్యాల లూగుతు న్నవి. 'నీవు లేకపోతే, యీ స్వర్గోద్యానములోని కోమటి కొట్టువృత్రాసురుడుగా మారి తన పొట్టబెట్టుకునేది; నా అదృ ష్టంకొద్దీ నందనవన యింద్రాణివి – నీవు లభించావు! 'అయ్యో వ్రాత! యవ్వనం అస్త్రాదిముఖంపట్టకముందే, దాని మహాత్తు కాస్తా పోతూవుంది! అందుకే యింద్రాణి తన ప్రతిష్ఠనిల్పుకో లేకపోతూంది. ఆ నాడు మనసులో లవలేశమైనా సందేహం పొడసూపిందా? తన దరిదాపుల మరొకరెవరూ లేరు! ఆ కాశ పథంలో ప్రభాతకాల అరుణోదయంమాదిరి పరిపూర్ణంగా విరాజిల్లింది. ఇవాళ నీడచూసికూడా గుండె చెదిరిపోతూవుంది. ఆత్మవిశ్వాసంకూడా లేకుండా పోయింది. తననుగురించి తనే సందేహించేస్థితిలోకి దిగజారిపోయింది. సూర్యాస్తమయానికి పూర్వమే తన నొసట యింత దైన్యం వ్రాసిపెట్టి వుంటుందని

యెవరూహించారు? ఇంతకాలంనుంచి ఔదార్యంతో యింత సుఖం, గౌరవప్రతిష్టలు ప్రసాదించిన విధికూడా యివాళ పట్ట పగలు కన్నంవేసి, యిచ్చినదంతా మళ్ళీ దోచుకుపోయాడు!

"రోషనీ కొంచెం యిటురా!"

"ఏమిటమ్మా!"

"మా బాబుగారు నన్ను - 'విలాసమందిరరాణి' అని పిలిచేవారు; పట్టుమని పదేళ్ళు కాలేదు పెళ్ళి అయి-యింకా ఆ వన్నె మాయలేదు, కాని ఆవిలాసమందిరం యేమయింది?"

"ఆ విలాసమందిరం నీదే; యెక్కడికీపోయిందమ్మా - రాత్రంతా నిద్రలేదు. కొంచెం కన్నుమూసుకో, పాదాలు సవరిస్తాను."

"రోషనీ, ఇవాళ పౌర్ణమి అనుకో! ఎన్నో వెన్నెల రాత్రులు నిద్రపోలేదు. యిద్దరం తోటలో పచారుచేసేవాళ్ళం. ఆ జాగరణకి, యీ జాగరణకి పోలిక యేముంది? ఇవాళ కునుకు పడితే, బతికిపోదును. కాని ఆపాడు నిద్ర రావటం లేదు"

"మాట్లాడకుండా పడుకోతల్లీ, నిద్ర అదేవస్తుంది!"

"సరేగాని, వెన్నెలరాత్రుల్లో వారిద్దరూ పూదోటలో తిరుగుతుంటారా?"

"వారిద్దరూ ప్రొద్దున్నే మార్కెటుకు పంపే పూలు కోస్తుండటముచూశాను. షికార్లుచేయటానికి వారికి తీరిక యేది?"

"మాలీలకు యిప్పుడు కోరినంత నిద్ర! కావాలనే వాళ్ళని లేపటంలేదు కాబోలు!"

"మీకు తప్ప, వాళ్ళకి పని పురమాయించే ధైర్యం యెవరి కుంది?"

"బండి వస్తున్నట్టుంది; చూడు!"

"అవును, బాబుగారిబండి!"

"కొంచెం చేతి అద్దం యిలా తే! సేఫ్టీపిన్ బాక్సు ఎక్కడవుందో చూడు! మంచిగులాబి, కుండీలోనించి తీసుకు రా! ఇవాళ మొహమంతా పీక్కుపోయినట్టుంది."

"వెళ్ళుతున్నా; కాసినిపాలు తాగమ్మా! మాతల్లి—"

"అలావుండనివ్వు, నేను తాగను"

"రెండుపూటల మందూ తీసుకోలేదు."

"నీవు గొణగకుండా వెళ్ళు యిక్కడినుంచి, ఆ కిటికీతీసి"

పనిమనిషి వెళ్ళిపోయింది.

గణగణ మూడుగంటలు కొట్టారు. ఎండ పెళపెళ లాడుతూవుంది; నీడలు తూర్పుకువాలినవి; దక్షిణపుగాలులు వీస్తున్నవి; కొలనినీరు మిలమిల మెరుస్తూ వుంది. మాలీలందరూ పనిలో వంగారు. నీరజ చూపు ఆనినంతవరకు చూస్తూవుంది.

ఆదిత్యుడు అంగలు వేసుకుంటూ వచ్చాడు. అతని చేతుల్లో పసుపుపచ్చని లాబర్నమ్ పూగుత్తులు వున్నవి. వాటిని నీరజ పాదాలచెంత వుంచి, పక్కమీద కూచుంటూ ఆమె చేతులు రెండూ నొక్కుతూ — "ఇవాళ వుదయంనుంచి నిన్ను చూడరాలేకపోయాను నీరూ" అన్నాడు. నీరజ తనను సంబాళించుకోలేక వెక్కివెక్కి యేడవసాగింది. అతను మంచం మీదనుంచి దిగి, మోకాళ్ళు ఆనించి నేలమీద కూచుని,

ఆమె కంఠాన్ని కావలించుకున్నాడు. కన్నీటి చారలు కట్టిన ఆమె చెక్కిళ్ళను ముద్దాడుతూ—"ఇందులో నా తప్పేమీ లేదని నీకు గట్టిగా తెలుసు!" అన్నాడు.

"అంతగట్టిగా నాకెలా తెలుస్తుంది చెప్పూ? ఇవేం నా పూర్వపు దినాలా ?"

"దినాలు లెక్కించటమేమిటి నీరూ ? నీవు నా ఎప్పటి 'నీరూ'వే !"

"ప్రతివిషయానికి యివాళ నా మనస్సు భీతిల్లుతూ వుంది. మనస్సు పూరట చెందటంలేదాయె !"

"కొంచెం కొంచెంగా భీతిల్లటం మంచిదే ! కాదూ ? నన్ను ఆటలు పట్టించి వుడికిలించాలని చూస్తున్నావు. ఈ చాతుర్యము స్త్రీలకు స్వభావసిద్ధమే !"

"మరపు పురుషులకు సహజమేమో ?"

"మరపుకు అవకాశమెక్కడ యిస్తున్నావు ?"

"ఎక్కువ మాటలు దేనికిలే, విధివ్రాతవల్ల పూర్తి అవకాశం లభిస్తుంది !"

"పెడమాట పలకమాకు నీరూ, సుఖంలో మరవ వచ్చుకాని దుఃఖాల్లోకాదు—"

"ప్రొద్దున్నే మీరు మరచిపోయి వెళ్ళలేదూ, నిజం చెప్పండి ?"

"ఏం మాటలవి నీరూ, తప్పనిసరి అయి, వెళ్ళానన్న మాటేగాని నా మనసు మనసులోలేదు."

"అలా కూచున్నారేమిటి? సరిగా పక్కమీదికి వచ్చి కూచోండి."

"పారిపోతానేమోనని కాళ్ళకు సంకెళ్ళు వేయ జూస్తున్నావా?"

"అవును, సంకెళ్ళు వేయాలనేవుంది, చావుబ్రతుకుల్లో మీ పాదసన్నిధిని వుండాలని."

మధ్య మధ్య కొంచెం శంకిస్తూవుండు, అప్పుడుగాని మన ప్రేమ కొత్తదవులు చూరగొనదు!"

"కాదు, కాదు. సందేహం రవంతకూడా లేదు. మీలాంటి భర్తలు యెంతమందికి దొరుకుతారు? మిమ్మల్ని కూడా శంకించనా? అది నాకే అవమానం!"

"అయితే నేనే నిన్ను శంకిస్తానులే, లేకపోతే నా టీకం రక్తికట్టదు!"

"అలానే! నా కా భయమేమీలేదు. అప్పుడది ప్రహసనమవుతుంది!"

"ఎన్నయినా చెప్పు, యివాళమాత్రం నన్ను సందేహించావు!"

"ఆ ప్రసంగం మళ్ళీయెత్తుతారు దేనికి? మీరు దండించవలసినపని లేకుండానే తగిన శిక్ష అనుభవించాను."

"శిక్షయేమిటి? అప్పుడప్పుడు కోపతాపాలు లేకపోతే ప్రేమనాడి అందనట్టే!"

"ఎప్పుడయినా మీమీద కోపంవచ్చినా, అది నా దుష్టదేవతా ప్రభావమేకాని నా తప్పుకాదు!"

"ఏదోఒక దుష్టదేవత మనందరికీ వుంటుంది; నేనూ వున్నానంటూ తలచూపుతుంది మధ్య మధ్య! కన్ను తెరిచి రామనామం జపించామా, అయిపు అజా వుండదు!"

ఇంతలో పనిమనిషివచ్చి – "బాబుగారూ, మందూ మాకులు అటుంచి, తెల్లవారినాక వచ్చి మంచినీళ్ళు ముట్ట లేదు" అని చెప్పి, చేతులు తిప్పుతూ విసురుగా వెళ్ళింది..

ఆదిత్యుడు లేచి నిలబడి, "నిజంగా నీమీద కోపం వస్తూంది!" అన్నాడు.

"మీ యిష్టమొచ్చినట్టు కోప్పడండి కాని ఆ తర్వాత మన్నించండి"

అతను గుమ్మంలోకి వచ్చి సరళను కేకవేశాడు.

ఆ మాట వినగానే నీరజకు జెర్రులు పాకినట్టుంది. విరిగిన ముల్లుమీదే దెబ్బ తగిలింది. సరళ వచ్చింది. అతను కోపంతో – "ఇవాళ పొద్దుటినుంచీ నీరజకు మందుగాని పాలుగాని యివ్వలేదట. ఎందుకని?" అన్నాడు.

"దాని తప్పేముందని కేకలేస్తారు యిందులో? నేనే వద్దని మొరాయించాను. సరళా, వెళ్ళరాదూ, నిలబడి చీవాట్లు తినకపోతే?"

"వెళ్ళటమెందుకు మందు హార్లిక్సు యిస్తుంది"

"పాపం పగలంతా మాలీలతో పాటు వొళ్ళు విరుచుకు పనిచేసేదికాక, మళ్ళీ యీ నస్సుపని మీదవేస్తారు దేనికి? మీకు దానిమీద జాలి అయినా కలగటంలేదా? రోషనీని పిలవరాదా?"

"ఈ పని దానికేం తెలుస్తుంది?"

"అబ్బ, యింత గొప్పపనా? అది అన్నీ చక్కగా చేసి పెడుతుంది"

"కాని –"

"మళ్ళీ 'కాని' యేమిటి? రోషనీ!"

"అంత వేగిరపాటు ఎందుకు? ఉద్రేకపడితే, మళ్ళీ నొప్పి తిరగబెడుతుందేమో!"

"పనిమనిషిని పంపుతాను" అని సరళ వెళ్ళిపోయింది. నీరజకు సమాధానం చెప్పడానికికూడా ఆమెనోట మాట రాలేదు. ఆదిత్యుడు కూడా లోలోపల చకితుడై, నిజంగానే సరళచేత ఫ్రూడిగం చేయించుకుంటున్నామా అని ఆలోచించ సాగాడు.

మందు, హార్లిక్సు యిచ్చినాక ఆదిత్యుడు రోషనీని సరళను పిలవమన్నాడు.

పనిమనిషి వెళ్ళింది.

"మాట మాట్లాడితే సరళ - మీరు పాపం దాన్ని వేపుకతింటున్నారు మరీను!"

"పని విషయం మాట్లాడాలి"

"ఇప్పుడెందుకు, పోనిద్దురూ!"

"యెక్కువసేపు పట్టదు."

"సరళ పసిగాయ-ఇన్ని పనులు దానిమీదపడితే ఎలా? అంతకంటె హారియాకి అప్పగించరాదా?"

"నిన్న పెళ్ళాడినదగ్గరనుంచి పనిచేయడం స్త్రీలవంతు కాని పురుషులు నిష్ప్రయోజకులని తేల్చుకున్నాను. మేము పనిచేసేది గత్యంతరం లేక. స్త్రీలు అలాకాదు, మానసిక వుత్సాహంతో చేస్తారు. దానిమీద 'థీసిస్' కూడా వ్రాయ సంకల్పించుకున్నాను. నా డైరీనిండా యెన్నో తార్కాణాలు వ్రాసివుంచాను"

"మానసికోత్సాహంతో పనిపాటలు చేసే స్త్రీని కొరగాకుండా చేసిన ఆ విధిని యెలా నిందించకుండావుండేది ? స్వయంకృషిలో నిర్మించుకున్న గృహం కాస్తా భూకంపంతో కూలిపోయింది. అందుకనే యివాళ ఆ శిథిలాల్లో దెయ్యాలు కాపరం చేస్తున్నవి"

ఇంతలో సరళ వచ్చింది.

"పొదరింటిపని పూర్తయింది?"

"ఆఁ – "

"అంతా?"

ఆఁ"

"మరి గులాబీలు?"

"మాలీలు నేల బాగుచేస్తున్నారు!"

"నేల బాగుచేస్తున్నారా? ఎప్పుడో చేసివుంచానే! హరియాకి అప్పగించావా యేం? ఇంకేం, మన్ను, దుమ్ము చేసి పెడతాడు."

నీరజ ఆ విషయం మధ్యలోనే తుంచివేయాలని – "సరళా, నీవు వెళ్ళి నారింజరసం తీసుకురా, అందులో కొంచెం అల్లం, తేనెకూడా కలుపు!" అంది.

తలవంచుకుని సరళ వెళ్ళిపోయింది.

"ఇదివరకటి మాదిరే మీరు యివాళకూడా చీకటితో లేచినట్టుందే?"

"అవును"

"అలారం పెట్టివుంచారా?"

"ఆఁ."

"వాసు టీ సామానంతా నిమ్మచెక్క టేబిలుమీద సిద్ధంగా వుంచాడా?"

"అన్నీ సిద్ధంచేసి వుంచాడు. లేకపోతే నీ కోర్టుకు ఫిర్యాదు తీసుకురానూ?"

"రెండుకుర్చీలూ వేశాడా?"

"ఆఁ. నీలిచారలువున్న నీ పసుపుపచ్చని టీ కప్పులూ, వెండి పాలజగ్గూ, అంచులుచిందే రాచిప్పలో పంచదార, డ్రేగానుబొమ్మల జపాను ట్రే, అన్నీ అమర్చాడు."

"రెండోకుర్చీ ఖాళీగా వుంచారేం?"

"కావాలని వుంచలేదు. ఆకాశంలోని నక్షత్రాలు లెక్కకు సరిపోయినవి, కాని శుక్లపక్షమునాటి చందమామ దిగంతానికి ఆవల వుండిపోయింది. వీలుచిక్కితే పట్టుకొచ్చే వాణ్ణే!"

"సరళను పిలవలేకపోయారా?"

అందుకు సమాధానం 'నీ తావున మరొకరిని కూర్చో నివ్వటం నాకిష్టంలేదు' అని చెపితే చక్కగా ఉండేది కాని ఆ యదార్థవాది – "సరళ నా మాదిరికాదు, పొద్దున్నే పూజా పునస్కారాలు ప్రారంభిస్తుందిగదా!" అన్నాడు.

"టీ తీసుకున్నతర్వాత, పొదరింటికి వెంటబెట్టుకు వెళ్ళారు కాబోలు?"

"అవును, అక్కడ మిగిలిపోయిన పని సరళకు వివరించి ఆదరాబాదరా వెళ్ళాలసివచ్చింది."

"అది సరేగాని, సరళను రమేశుకిచ్చి పెళ్ళెందుకు చేయరూ?"

"పౌరోహిత్యం నా వృత్తి కాదు!"

"కాదు, ఎగతాళి కాదు. ఎలాగూ పెళ్ళి చేయాలి గదా – రమేశులాంటి కుర్రవాడు అన్నప్పుడల్లా దొరకు తాడా?"

"చేసుకునే పిల్లకీ పిల్లవాడికీ యిష్టమో కాదో తెలుసు కొనే తీరికగూడా లేకుండా ఉంది. అయినా దూరానికి యేదో వెలితివున్నట్టు కన్పిస్తుంది"

నీరజ కొంచెం విసుగ్గా– "మీకు నిజంగా చేయాలని వుంటే, వెలితిలేదు, లోటూ లేదూ." అంది.

"పెళ్ళి ఎవరిదో అయితే, మధ్య నాకొక్కడికే కష్టమా? నేను అనుకుంటేమాత్రం సాగుతుందా? నీవు ప్రయత్నించి చూడరాదూ?"

"కొన్నాళ్ళపాటు సరళకు తోటపనినుంచి సెలవు మంజూరు చేయండి. తీరక వుంటే, మంచిసెబ్బర తెలుసుకుని ఒకచోట చూపు నిలుపుతుంది!"

"శుభదృష్టి వెలుగులో చెట్టుచేమలు సమ సమా ఉజ్జ్వలంగా భాసిస్తవి. దాన్ని ఒకరకమైన ఎక్సరే అనుకో!"

"వట్టిమాటల కేమిలే! సరళ పెళ్ళికావడం మీకు బొత్తిగా యిష్టంలేదు"

"ఇప్పటికి గ్రహించావు నా ఆంతర్యం! సరళ వెళ్ళి పోతే, యీ తోట యేం గాను? లాభనష్టాలుకూడా చూసు కోవాలా?– అరె, రె, యిదేమిటి? నొప్పి ఎక్కువయిందా వున్నట్టుండి?"

అతను ఉద్విగ్నుడయాడు.

"ఏమీలేదు. మీరేమీ నా కోసం ఆదుర్దా పడనక్కరలేదు," అంది నీరజ మార్దవంలేని కంఠంతో.

అతను లేచిపోబోతుంటే,– "మన వివాహానంతరమే ఆర్కిడ్ పొదరిల్లు నిర్మించినసంగతి మీరు మరచిపోలేదుగదా! ప్రతిరోజూ ఆ యింటిని మనం అలంకరిస్తూవచ్చాము. దాన్ని యివాళ చేజేతులా పాడుచేయటానికి మీమనస్సు యే మాత్రమూ బాధపడటం లేదూ?" అన్నేసింది నీరజ.

అతను విస్తుబోయి–"ఏమిటలా మాట్లాడుతున్నావు ? దానిని పాడుచేయాలనే వుబలాటం నాకు వున్నట్టు నీ కెలా తెలిసింది ? ఎప్పుడు తెలిసింది ?" అన్నాడు.

నీరజ ఉత్తేజితురాలై–"సరళకు తోటపని ఏం తెలుసు?" అంది.

"ఏమిటి ! సరళకు తెలియదా ! నేను పెరిగి పెద్దనయింది సరళ పెత్తండ్రి యింట్లో. తోటవిషయం, వారే నాకు ఓనమాలు దిద్దబెట్టారని నీవు యెరుగుదువు. 'తోటపని, ఆవు పాలు తీయటం స్త్రీలపని' అనివారు అంటుండేవారు. సరళ ప్రతిపనిలో వారికి తోడుగావుండేది."

"మీరేమో చేదోడు వాదోడుగా వుండేవారు !"

"అవును, నిజమే! కాని నేను కాలేజిచదువు చూసుకోవాలి. సరళమాదిరి నాకు అంత తీరిక యెక్కడిది ? సరళకు వారే చదువు చెప్పేవారు !"

"ఆ తోటమూలానే వారు సర్వనాశనమయారు. ఆపిల్ల పాదం అలాంటిది ! ఎక్కడ కాలుమోపితే అక్కడ జిల్లేళ్ళు మొలవాలసిందే ! నాకు అదేభయం. మైదానంలాంటి

లలాటం; పైగా గుర్రంమాదిరి, యెగిరి యెగిరి నడుస్తుంది. స్త్రీలకు మగవాళ్ళ బుద్ధిరావటం శుభంకాదు; దానివల్ల చెరుపుకూడా !"

"ఇవాళ యిలా మాట్లాడుతున్నావేమిటి? వారికి తోటపెంచటం చేతనవుకాని వ్యాపారం వల్లకాని పని! పూల పరిశ్రమలో వారికి యెవరూ సాటిరారు; అద్వితీయులు. నష్టం భరాయించటంలో కూడా అంతే! పేరు గడించారు కాని డబ్బు గడించలేకపోయారు. తోటకు నాకు పెట్టుబడి యిచ్చినప్పుడు, వారు నడిసముద్రంలో వున్నారు. పాపం వారు దేహం చాలించకముందే, నా కిచ్చిన డబ్బు చుప్తాగా తీర్చ గలిగినందుకు సంతృప్తి పడుతూంటాను."

సరళ నారింజరసం తెచ్చింది.

"పెట్టు అక్కడ" అంది నీరజ.

సరళ టీపాయిమీద వుంచి వెళ్ళింది. నారింజరసం అలానే పడివుంది. ముట్టుకోలేదు కూడా.

"మీరు సరళను యెందుకు పెళ్ళిచేసుకోలేదు?"

"ఇవాళ నీవు మాట్లాడేది నాకు బొత్తిగా అంతు పట్టటంలేదు. వివాహవిషయమే నా మనస్సులో మెదలలేదు."

"మెదలలేదా! ఇదేకామాలు మీ కవిత్వం!"

"జీవితంలో మొట్టమొదటగా కవిత్వభూతం పూనింది నిన్ను చూసిననాడే! అందాకా ఆటవికు లిద్దరం కలిసి చెట్లు చేమలతో కాలం వెళ్ళబుచ్చాము-మమ్మల్ని మేముమరిచి! ఈ కాలపు నాగరికతలో పెరిగిపెద్దవాళ్ళమయితే యెలావుం డేదో చెప్పలేను."

"ఇందులో సభ్యత ద్రోహమేముంది?"

"నేటి సభ్యత దుశ్శాసనునిమాదిరి మనస్సనే చీరెను అపహరింపజూస్తుంది. అనుభవానికి ముందే, కళ్ళల్లో వేలెట్టి పారంగతుల్ని చేస్తుంది! సుగంధసంకేతము దానికి కడు సూక్ష్మమైనది; రెబ్బవిరిచిగాని, అంతా తెలుసుకోదు!"

"సరళ చూపులకు అనాకారికాదే!"

"సరళను నేను సరళగానే యెంచుతూవచ్చాను. చూపులకు బాగుంటుందాలేదా అని నేనెన్నడూ పరిశీలించి చూడలేదు."

"సరేగాని, మీకు సరళమీద ప్రేమలేదూ, నిజం చెప్పండి?"

"సరళమీద ప్రేమలేకపోవటమేం? నేనేం యెందు కట్టెనా? సరళ పెత్తండ్రికి రంగూన్‌లో ప్లీడరీచేస్తున్న కొడుకును గురించి బెంగలేదు. ఆ తోటను సరళ నిలబెట్టగలిగితే, అదేచాలు వారికి! ఈ పూదోటే సరళ మనోశరీరాల్లోలీనమై, సరళకు పెళ్ళిధ్యాసేవుండదని వారి నమ్మకం. ఆ తర్వాత వారు వెళ్ళిపోయారు; సరళ దిక్కులేనిపక్షి అయింది. ఋణదాతల చేతిలోకి పోయింది తోట. ఆ నాడు నా గుండె బేజారైపోవటం నీకు గుర్తులేదా? ప్రేమించదగినవస్తువుకు దూరంగా యెలా వుండను? ఒకనాడు సరళమోము కళకళలాడుతూవుండేది; నడకతీరులో పక్షులు తేలియాడుతున్నట్టుండేది. నేడో; గుండెమీద పెద్దభారం మూపుకుని నడుస్తోంది, అయినా·కుంగి నామరూపాలుపోగొట్టుకోలేదు. నా వద్ద, మిన్నువిరిగి మీదపడినా,

నిట్టూర్చి ఎరుగదు—పనిపాటల్లో మునిగి ఆ మాత్రం తీరుబాటు కూడా వుంచుకోదు."

నీరజ మధ్యలోనే అడ్డుతగిలి—"ఇక చాలులెండి, చాలా సంగతులు చెప్పారు ఆవిడనిగురించి! అసాధారణమైన పిల్ల కనుకనే, బొర్నాత్ కన్యావిద్యాలయానికి హెడ్‌మిస్ట్రెస్‌గా పంపరాదా అని? వాళ్లూ ఆ వుద్యోగంయిస్తామంటిరి!" అంది.

"ఆ విద్యాలయమేంకర్మ? అండమానులూవున్నయ్!"

"లేదు, ఎగతాళికి నేను చెప్పటంలేదు. మీరు సరళకు ఏ పనైనా అప్పగించుకోండి కాని, ఆ పొదరింటిపనిమాత్రం అప్పచెప్పటానికి వీల్లేదు."

"ఏం, ఎందుకని?"

"సరళకు ఆర్కిడ్‌నిగురించి భ్రాంతిగా తెలియదు"

"సరళకు నాకంటె యెక్కువ తెలుసు. వాళ్ళ పెత్తండ్రికి ఆర్కిడ్ అంటే పంచప్రాణాలు! వారు ప్రత్యేకంగా మనుష్యుల్ని పంపి జావా నుంచి చైనానుంచికూడా తెప్పించేవారు; ఆనాడు వారి ఆ వేదన అర్థంచేసుకున్నవాళ్ళే అరుదు!"

ఈ విషయం నీరజకు తెలుసు, అందుకే సగం మంట!

"సరే, సరళకు మీకంటె, నాకంటెకూడా బాగా తెలుసు! అయితేయేం. ఆ పొదరిల్లు మనిద్దరిది! అందులో సరళకు హక్కేమీలేదు. కావాలనుకుంటే, యీ తోటంతా దానికి కట్టిపెట్టండి. నాకుమాత్రం చేరెడు నేల వదలండి, అది కేవలం నా స్వాత్కృతిదే! ఇంతకాలానికి యీ మాత్రమైనా అడగనోచుకోనా? దురదృష్టంవల్ల మంచానబడ్డాను-" చెప్పేది పూర్తి చేయలేక దిండులో మొహందూర్చి ఏడవసాగింది.

ఆదిత్యుడు నివ్వెరపోయాడు. ఇన్నాళ్ళనుంచీ అతను స్వప్నప్రపంచంలో విహరిస్తున్నట్టుంది. ఇవాళ యెదురుదెబ్బ తగిలి త్రుళ్ళిపడ్డాడు. ఆమె రోదన యీనాటిది కాదు, చాలా రోజులది. వేదనాతరంగాలు దినదినమూ వుధృతమవుతున్నయి. కాని అతని చూపు క్షణకాలంకూడా అటువైపు పోలేదు. సరళ తోటపనులు చూస్తుంటే, నీరజ సంతోషిస్తున్నదిగదా అనుకున్నాడు. ఋతువునుబట్టి పూలమళ్ళు పెట్టటంలో సరళపేరు ముందు చెప్పాలి. ఒకనాడు ఏ సందర్భంలోనో సరళ పనితనానికి మెచ్చుకుని – 'కామినీలతను యింత చక్కగా పాకించటం నావల్లకూడా కాదు' అనగానే, నీరజ బిగ్గరగా నవ్వి – 'తలకు మించిన విలువయిస్తే, చివరికి అవతలవాళ్ళే నష్టపడతారు' అని అనేసింది. మొక్కలవిషయంలో సరళ చిన్న పొరపాటు పడినా, నీరజ గేలిచేసిగాని వదిలేదికాదు. నీరజ యింగ్లీషు కేటలాగులోవి వాడుకలో లేని కొన్ని పూలపేర్లు వల్లెవేసి తెలియనట్టు వాటి పేర్లు సరళను అడిగేది. సరళ తప్పుచెప్పిందా, పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వి 'పెద్ద పండితురాలు బయలుదేరింది. దీనిపేరు 'కాసియ జావనికా' అని చివరికి మా హరియాకూడా చెపుతాడే!' అంది. అతనికి యిలాంటివి యెన్నో తలపుకు రాసాగినవి.

అతను చాలాసేపు ఆలోచిస్తూ కూచుని, నీరజ చేయి తన చేతిలోకి తీసుకుంటూ – "యేడవమాకు నీరూ, మనసులో వున్నది చెప్పు! నీవు చెప్పినవిధంగా చేస్తా. సరళను తోటపనులకు దూరంగా వుంచుదామా? చెప్పు!" అన్నాడు.

నీరజ తన చేయి విడిపించుకుని — "నాకోసం మీరేమీ చేయనక్కర్లేదు. తోటమీది, మీ యిష్టంవచ్చినవాళ్ళని అట్టిపెట్టుకుంటారో, తీసివేస్తారో!" అంది.

"నీరూ, ఆమాట ఎలా అనగలిగావు! తోట నావొక్కడిదా! నీదికాదూ! పంపిళ్ళు యెవ్వడు జరిగినై! నా హిస్సాకి యెవ్వడొచ్చింది?"

"యీ విశ్వజగతంతా మీది. యీ చీకటికోణం నాది అయిననాడే, తోట మీదైపోయింది. విరిగిపోయిన మనసుతో, మిరుమిట్లుగొలిపే సరళ సమక్షాన దేన్ని వూతం చేసుకుని నిలబడగలను? మీకు సేవచేయటానికి నేను నాలో ఆ శక్తి యేది?"

"నీరూ, స్వయంగా నీవే సరళను యెన్నోసార్లు పిలిపించావు-తోటవిషయాలు సంప్రదించావు. ఒకనాడు మీరిద్దరూ దబ్బతో కలిపి, నారింజ అంట్లు తొక్కి, నన్ను విస్మయపరిచిన సంగతి గుర్తురావటంలా?"

"అప్పటి సరళ స్వభావం వేరు. ఆ విధి నేడు నా జీవితాన్నే అంధకారమయం చేశాడు. అందువల్ల నేగదా, సరళకు అంత తెలుసు, యింత తెలుసు, ఆర్కిడ్‌ని గురించి. నాకు తలా తోక తెలియదని మీకు తడుతూవుంది! ఆనాడు యెవరి నోటా యిలాంటి మాటలు వినలేదు. ఏమనుకుని యీ కష్టకాలంలో మా యిద్దరినీ పోల్చబోతున్నారు? ఇవాళ నేను సరళతో యెలా నెగ్గుతాను? యెలా సరితూగుతాను మీరే చెప్పండి"

"నీరూ, నీ నోట యీ మాటలు వింటానని కలలో కూడా వూహించలేదు. ఇవాళ మాట్లాడుతున్నది నా 'నీరూ' కాదు, మరొకరు అనిపిస్తూవుంది."

"కాదు, కాదు. నేను 'నీరూ'నే! ఇంత కాలానికికూడా నా మాటలు అర్థంచేసుకోలేక పోయారంటే, అదే నాకు పెద్దశిక్ష! పెళ్ళయిన తర్వాత, యీ పూదోట మీకు పంచ ప్రాణాలతో సమానమని తెలుసుకున్న నాటినుంచీ, నన్నూ, తోటనూ వేరుగా భావించుకోలేదు. లేకపోతే మీ పూదోటతో నాకు యేనాడో పేచీవచ్చేది; నాకు అది కంట్లో నలుసు అయేది; దాన్ని నా సవతిగా యెంచేదాన్ని! అహోరాత్రులు నా తపస్సు యేమిటో మీకు తెలుసు! ఆ పూదోటలో నేను యెంతగా లీనమైపోయానంటే ద్వంద్వమనేది లేకుండా ఐక్యమయ్యాను."

"నీవు నా సర్వస్వాన్ని మిళితం చేసుకుని వున్నావని నేను యెరగనా?"

"ఇవన్నీ అలా వుంచండి. ఇవాళ పూతోటలో మరో వ్యక్తి సునాయాసంగా చొరబడగలిగింది. అందుకు మీకేమీ బాధకలగలేదూ? నా దేహాన్ని చీల్చి, అందులో మరొకరి ప్రాణప్రతిష్ఠ చేయగలనని యెన్నడైనా వూహించగలిగారా? ఈ పూదోట నా దేహం కాదూ? మీ తావులో నేనుంటే, యిలా చేయగలిగేదానినా?"

"ఏం చేసేదానివి?"

"ఏంచేసేదానినో చెప్పనా? పూదోట బీడుకానీ, వ్యాపారం దివాళాతీయనీ, వొకడికి పదిమంది మాలీలను

అయినా పెట్టేదాన్ని కాని మరొకస్త్రీని - ప్రత్యేకించి, నా కంటె, తోట పెంపకం బాగా తెలుసని గర్వపడే మరోవ్యక్తిని లోనికి అడుగుపెట్టనిచ్చేదాన్ని కాదు. నా శక్తిసామర్థ్యాలు నిరూపించుకోటానికి అవకాశమేది ? మీకు ఆవిడ గర్వాన్ని ఆసరా చేసుకుని, కాటికి కాళ్ళుజాచుకు కూచున్న నన్ను రాత్రింబవళ్ళు అవమానిస్తుంటారా ? ఇది యెలా సాధ్య మయిందో చెప్పనా ?"

"ఆఁ !"

"సరళమీద నా మీదకంటె యెక్కువప్రేమ మీకు. ఇంతకాలమూ నాకు తెలియనీయకుండా కప్పిపుచ్చారు !"

అతను కాసేపు బుట్టలో వ్రేళ్ళుజొనిపి కూర్చుని, విహ్వలుడై - "నీరూ, పదేళ్ళనుంచి కష్టసుఖాల్లో, ప్రతివిషయంలో, ప్రతిచిన్నపనిలో నీవు నన్నెరుగుదువు. అప్పటికీ నీవు యీ మాట అనగలిగితే, నేనేమి సమాధానం చెప్పను. వస్తాను దగ్గిరవుంటే, నీ ఆరోగ్యం మరీ చెడిపోవచ్చు. పర్ణ్ణ రీదగ్గిర జపాను యింట్లోవుంటాను. నాతో అవసరంకలిగితే, కబురు పంపు." అని చెప్పాడు.

## 5

కొలని ఆవలివొడ్డున నేరేడుచెట్ల గుబురులో చంద్రుడు వుదయిస్తున్నాడు. నీటిమీద దట్టమైన నీడలుపడుతున్నవి. అవతలివొడ్డు వసంతఋతువు చిగురుటాకులు, అప్పుడే నిద్ర లేచిన పసిపిల్లల నేత్రాలమాదిరి యెర్రగావున్నవి. ఆ పూల రంగు మెరుగుపెట్టని బంగారంలావుంది ; ఆ పూల గాఢపరిమ

శాలు భారాక్రాంతమై పరువులుతీయటంలేదు - ఘనీభవించి నట్టుంది. మిణుగురుపురుగులు కొమ్మలమీద మెరుస్తున్నవి. సరళ రేవుగట్టున మౌనంగా కూచునివుంది. ఎక్కడా ఆకు కదలటంలేదు; నీరు నల్లనినీడల వాకిట్లో, పాలిషుపెట్టిన వెన్నెల అద్దం బిగించినట్టుగా వుంది.

"రావచ్చునా?" వెనకనుంచి ప్రశ్న వినిపించింది.

సరళమృదువుగా - "రా!" అంది.

రమేశు రేవుమెట్లమీద, సరళపాదాలచెంత కూర్చు న్నాడు. సరళ తొట్రుపడుతూ - "అక్కడ కూచున్నావేం, పైకిరా!" అంది.

"వర్ణన పాదపద్మాలతోనే ప్రారంభం! సరసన తావు వుంటే, ఆ తర్వాత కూర్చుంటాను. చేయి యిటుతే, విదేశీ పద్ధతిలో కరచాలనం చేద్దాము."

సరళచేతిని ముద్దెట్టుకుని - "మహారాజ్ఞికి యివే నా అభి వందనలు! స్వీకరించండి!' అన్నాడు రమేశు.

రమేశు లేచి నిలబడి, జేబులోనుంచి కొంచెము గులాముతీసి, సరళ నుదుటవుంచాడు.

"ఇదేమిటి?"

"ఇవాళ ఫాల్గుణ పూర్ణిమ, హోలీ! గుర్తులేదా? మీ తోటలోని రెమ్మరెమ్మల రంగురంగుల పూలు కన్నులపండు వుగా వున్నవి. వసంతకాలంలో శరీరము కాదు; మనసూ రంగులువారుతుంది వనలక్ష్మీ! దానిని వెలివుచ్చకపోతే, అశోక వనంలోకి నిర్వాసితురాలి వవుతావు!"

"మాటల్లో నీతో నెగ్గే పాండిత్యం నాకెక్కడిది?"

"మీకు మాటలెందుకు? మగపిట్ట ఆలాపన చేస్తుంది; ఆడపిట్ట నిశ్శబ్దంగా ఆలకిస్తే చాలు, జవాబు చెప్పినట్టే! ఇక సర సన కూర్చోనివ్వు"

రమేశు దగ్గరికి వెళ్ళి కూర్చున్నాడు.

ఇద్దరూ చాలాసేపు మౌనంగా కూర్చున్నారు.

"జైలుకి యెలా వెళ్ళాలో నాకు కొంచెం సలహా యివ్వు?" అని హఠాత్తుగా అడిగింది సరళ.

"జైలుకి వెళ్ళటం మంచినీళ్ళప్రాయం! అందుకు సవాలక్ష మార్గాలున్నవి – జైలుకు యెలా వెళ్ళకుండా వుండాలో చెప్పటమే నేడు కష్టమైపోతోంది. ఈ కాలంలో ఆంగ్లేయుల మురళి యింట్లో కుదురుగా కూర్చోనిస్తుందా?"

"నేను యెగతాళికికాదు – నిజంగా అడుగుతున్నా. ఆలోచించి చూస్తే జైలే ముక్తిమార్గంలా వుంది."

"నీవు మనసువిప్పి, స్పష్టంగా చెప్పు!"

"అలానే చెబుతాను. ఆదిత్యభాయీ మోము చూస్తే నీకు అంతా అర్థమయేది."

"ఆ చిన్నెలు కొంచెంగా కన్పించినవి."

"సాయంకాలం వొంటరిగా వరండాలో కూర్చున్నాను. అమెరికానుంచి వచ్చిన పూల కేటలాగు చూస్తున్నాను. రోజూ సాయంత్రం నాలుగున్నరకు ఆదిత్యభాయీ టీ తీసుకుని తోటపనికి నన్ను పిలిచేవారు. ఇవాళ అటూయిటూ పరధ్యానంగా తిరుగుతున్నారు; మాలీలు పని చేస్తుంటే, వొక్కసారి అటు తిరిగి అయినా చూడలేదు. ఒకపర్యాయం వరండా

వైపుకు నేనున్న తావుకే వస్తున్నారనుకున్నా, కాని సంకో చంతో వెనక్కు తిరిగినట్టుంది. తనాబీలాంటి మనిషి – కాలు సాచివేసే నడక, పనిలో వాడుపు, నలువైపులా అజమాయిషీ చేసే దృష్టి, యజమానికి వుండవలసిన పట్టువిడుపులు – కాఠిన్యముకాని మొఖాన ఎప్పుడూ చిరునవ్వు తొలుకాడుతుంది; నేడు ఆ వ్యక్తిలో అవేమీలేవు. వెలుపల యేమి జరుగుతుందీ గమనంలేదు; ఎక్కడోవుంది వారిమనస్సు! చాలాసేపటికి అడుగులో అడుగువేసుకుంటూ నావద్దకి వచ్చారు. అదే మరొక నాడైతే, గడియారం చూసి టైము అయింది అనేవారు. నేనూ లేచి బయలుదేరేదాన్ని. నెమ్మదిగా కుర్చీలాగి కూర్చుని– 'కేటలాగు చూస్తున్నారా?' అన్నారు. నా చేతిలోనుంచి కేటలాగు తీసుకుని పేజీలు తిప్పసాగారు, ఏమీ చూస్తున్నట్టు లేదు. ఇక ఆలసించటం మంచిదికాదు. చెప్పవలసినది గట్టిగా స్పష్టంగా చెప్పివేయాలని నిర్ణయించుకున్నట్టు నా ముఖంవంక చూశారు. మరుక్షణమే కేటలాగువంక చూస్తూ – "ఎంత 'నైసటాపియమో' చూశావా సరూ" అన్నారు. మాట అలసినట్టుంది. తర్వాత చాలాసేపు యేమీ మాట్లాడకుండా పేజీలు తిరగవేయసాగారు. మళ్ళీ ఒకపర్యాయం నావంకచూసి చప్పున పుస్తకం మూసివేసి, నా వొళ్ళోకి విసిరి, లేచి బయలుదేరారు. 'తోటలోకి వెళ్తున్నారా?' అని అడిగాను. 'లేదమ్మా, కొంచెం పనుంది. బయటకు వెళ్ళిరావాలి' అని, సంకెళ్ళు తెంచుకున్నట్టు పారిపోయారు."

"వారు నీతో ఏమిచెప్పాలనుకున్నారని నీవుద్దేశం?"

"ఇదివరకు ఒకపూదోట మంగళమయింది. దీనినికూడా మంటగలపమని వుత్తరువువచ్చినట్టు చెప్పవచ్చారనుకుంటా."

"సరూ, అలాఅయితే నేను జైలుకువెళ్ళటం మానుకున్నట్టే!"

"ఆ దారి నేను మూసివేయగలనా! స్వయంగా చక్రవర్తి పిలుస్తున్నపుడు?"

"నీవు కొమ్మనుంచి దారిలో పడివుండటమూ, నేను సంకెళ్ళు వేయించుకుని దర్పంగా జైలుకు వెళ్ళటమూ! ఇదిజరిగే పనేనా? ఈ వయస్సులోనే, నేను పెద్దమనిషిని కావలసి వచ్చేట్టుంది."

"ఏమిచేద్దామని ?"

"నీ అశుభగ్రహాణంమీద యుద్ధం ప్రకటిస్తాను; నీ జన్మపత్రికనుంచి ఆ, గ్రహాన్ని పారదోలుతాను. తర్వాత అంతా తీరుబాటే – అండమానులదాకా!"

"నీవద్ద నేనేమీ దాచను. కొన్నాళ్ళనుంచి ఒక విషయం స్పష్టమవుతూంది. అది నీముందు వెలిబుచ్చుతాను; ఏమీ అనుకోవద్దు."

"చెప్పకపోతే, అనుకోవాల్సి వస్తుంది."

"బాల్యంనుంచీ, నేనూ ఆదిత్యభాయీ వొకేచోట పెరిగి పెద్దవాళ్ళమయాము – అన్నా చెల్లెలులా కాదు, సోదరుల మాదిరి. యిద్దరం సరసన నేల బాగుచేశాం; మొక్కలు పెట్టాం. మా అమ్మ, పెత్తల్లి రెండుమూడు రోజులు ఎడంగా టైఫాయిడ్‌తో కాలం చేశారు. అప్పటికి నాకు ఆరేళ్ళు. ఆ తర్వాత రెండేళ్ళకు మా నాన్న దేహాంచాలించారు. పెత్తండ్రి

గారికి అన్నిటికంటె జీవితంలో తోటమీద యెక్కువ మమ కారం! జీవితాన్ని అయినా ధారపోసి పూదోట సంరక్షిస్తా నని వారికి నామీద నమ్మకంవుంది. అలానే వారు నన్ను సాకారు. వారు అందరినీ నమ్మేవారు. అపనమ్మకమనేది ఏకోశానా యెరగరు. వారివద్ద అప్పుపట్టుకెళ్ళిన మిత్రులే, వారి బాకీలుతీర్చి పూదోట కాపాడతారని ఆశించారు. కేవలము ఆదిత్యభాయీ చెల్లువేశారు; మిగతావారెవరూ యెర్రని యేగాని యివ్వలేదు. ఈచరిత్ర యిదివరకే నీకు కొంతతెల్సు ననుకుంటాను; అయినా మొదటినుంచీ చెప్పాలనిపిస్తూంది."

"అంతా నాకు కొత్తగావుంది."

"తర్వాత అంతా కూలిపోయింది. ఏదోవిధంగా నావ వొడ్డుకు చేరేటప్పటికే, మళ్ళీ నా అదృష్టం అదిత్యభాయీతో పెనవేసుకుపోయింది. మొదటిమాదిరే సోదరులమాదిరి కలిసి పోయాము. ఆ నాటినుంచి వారి ఆశ్రయంలో వుంటున్నాను. అలానే వారినీ నా ఆశ్రయంలో వుంచుతూ వస్తున్నాను. నేనూ వారి మంచిసెబ్బరలవిషయం తగు శ్రద్ధతీసుకుంటున్నా నని నొక్కిచెప్పగలను. అందువల్లసంకోచించవలసిన అవసరమే కలగలేదు. మేము మొదట్లో ఒక తావునపెరిగిన సంబంధం తోటీ, అప్పటి మావయస్సుతోటీ పరస్పరంకలిసినట్లుగావుంది. ఇలానే జీవితం వెళ్ళిపోయేది. కాని చెప్పిమాత్రం?—"

"పూర్తిగాచెప్పు!"

"హఠాత్తుగా నాకు యుక్తవయస్సు వచ్చినవిషయము నొక్కి దేనికిచెప్పటం జరిగింది? మేము కలిసిమెలిసి యేరోజుల మరుగున పనిచేశామో, ఆ తెరకాస్తా వొక్క క్షణంలో

తొలగిపోయింది. నీకు అంతా తెలుసు. నా విషయం కప్పి పుచ్చింది యేమీలేదు. నామీద వదినగారి కోపం చూసి చాలా ఆశ్చర్యపోయాను. ఏమీ అంతుపట్టలేదు. ఇంతవరకు నన్ను నేను తేరిపారజూచుకోలేదు. వదినగారి క్రోధాగ్ని వెలుగులో నన్ను పరిశీలించుకున్నాను; నా దృష్టిలో నేను పట్టుబడిపోయాను. చెప్పేది అర్థమవుతుంది కదూ ?"

"అణగియున్న బాల్యప్రేమ-వొత్తిడికి, యివాళ బాహిరిల్లింది."

"ఏమిచేయను చెప్పు? నా నుంచి పారిపోయేది ఎలా?" అని చెపుతూ సరళ, రమేశు చేతులు పట్టుకుంది.

రమేశు మెదలకుండా వున్నాడు.

"ఇక్కడవుంటే, నా అపరాధం యెక్కువవుతుందేమో !"

"ఎవరి పట్ల ?"

"వదినగారిపట్ల !"

"ఇదుగో సరళా, యీ చాదస్తపు కబుర్లు నా దగ్గర చెప్ప మాకు. నీ స్వత్వాన్ని ఎలా నిలుపుకుంటావు ? మీ యిద్దరి స్నేహము యీనాటిదా ? ఆనాడు మీ వదిన ఎక్కడ వుంది ?"

"నీవు నామీదిప్రేమకొద్దీ, అలాపొసగని మాటలు చెపుతావేమిటి? ఆదిత్యభాయి విషయంకూడా ఆలోచించాలా""

"ఎందుకువద్దూ? నీకు తగిలినదెబ్బే వారికికూడా తగిలి వుండదని అనుకుంటున్నావా?"

"ఎవ రది? రమేశా?" వెనకనుంచి వినబడింది.

“అవును, అన్నాయి!” అని రమేశు లేచి నిలబడ్డాడు.

“మీ వదిన నీ కోసం కబురుచేసిందట, పనిమనిషి వచ్చింది యిప్పుడే!”

రమేశు వెళ్ళాడు. సరళకూడా లేచి నిలబడింది.

“వెళ్ళవద్దు సరూ, కూర్చో!”

ఆదిత్యుని మోముచూసి, సరళమనస్సు తరుక్కుపోయింది. పనిపాటల్లో క్షణంతీరుబడిలేకుండా, మైమరచివుండే యీ వ్యక్తి తుఫానులోపడి, చుక్కానివిరిగిన నావలాగా సుడిగుండంలో కొట్టుకులాడుతున్నాడు.

“మనిద్దరమూ పూర్తిగా ఐక్యమై జీవితాన్ని ప్రారంభించాము యిక్కడ! మన కలయిక ఎంత సహజమైనదంటే, ఏకారణంవల్లకూడా విభేదంవస్తుందని వూహించటమే అసంభవమనిపించింది. ఏం సరూ, అంతేనా?”

“అంకుర రూపంలో వొకటిగా వున్నప్పటికీ, పెరిగిన పిమ్మట వేరుకావచ్చును; దీన్ని తోసివేస్తే యెలా?”

“ఆ విభేదం బాహ్యం; కేవలం కళ్ళకి కన్పట్టేది — అంతఃకరణలో వేరుకావు. ఇవ్వాళ నిన్ను నాకు దూరంచేయటానికి వెల్లువ వచ్చిపడింది. ఇది నన్ను యింతగా నొప్పించి, కుంగతీస్తుందని అనుకోలేదు. సరూ, అకస్మాత్తుగామనం యెంత పెద్ద అఘాతానికి గురిఅయ్యామో వూహించావా?”

“ఎరుగుదును భాయీ, మీకంటె ముందే గ్రహించాను!”

“సహించగలవా?”

“తప్పేదేముంది?”

"కాని స్త్రీలలో పురుషులకంటె యెక్కువ సహనశక్తి వుంటుందనుకుంటాను?"

మీరు పురుషులు. దుఃఖాన్ని యెదిరించిపోరాడుతారు. మీ ధర్మం మొదటినుంచీ యిదే; కాని మేము యుగయుగాల నుంచీ దుఃఖాన్ని సహిస్తూవస్తున్నాము; బహుశా ముందు కూడా యింతే! కన్నీరు, నిబ్బరము - అంతకు మినహా మాకు మూలధన మేముంది?"

"నిన్ను నానుంచి వేరుచేయటం గొంతులో ఊపిరి ఉన్నంతవరకు జరగనివ్వను. ఇది అన్యాయం, దారుణం" అని చెపుతూ అతను ఆకాశంలోని అదృశ్య శత్రువుతో యుద్ధానికి సన్నద్ధమవుతున్నట్టుంది.

సరళ అతని చేతిని, తనచేతిలోకి తీసుకుని, నెమ్మదిగా సవరించుతూ, స్వగతంమాదిరి చెప్పుకుపోతూవుంది. "న్యాయా న్యాయాల విషయం కాదుభాయీ. విడివడని మన సంబంధం తెలిసిననాడు, చాలామంది నొచ్చుకుంటారు. నలువైపుల కల్లోలం రేగుతుంది. ఎవరిది తప్పు అనేట్టు?"

"నీవు సహించలేవు సరూ, నాకు తెలుసు! నా కొక సంగతి గుర్తుకొస్తూంది. నీవి చక్కని శిరోజాలు - యిప్పుడు కూడా! చిన్నతనంలో నీశిరోజాలు చూసుకుని నీవు మురుసు కునేదానివి. అందరూ నీ మురిపాన్ని ఎక్కువచేశారు! ఒకనాడు నీతో పోట్లాటవచ్చింది. మధ్యాహ్నపు వేళ దిండుమీాద తలపెట్టి జుట్టు విరియబోసుకుని పండుకుని వున్నావు. నేను కత్తెర చేత బట్టుకుని, పిల్లి అడుగులు వేసుకుంటూ వచ్చి, గుప్పిటనిండా నీ వెంట్రుకలు కత్తిరించాను. వెంటనే నీకు మెలకువ వచ్చింది.

వల్లని నీ నేత్రాలు మరీ నలుపుకు తిరిగినై. 'నేను ఈ మూత్రానికే లొంగిపోతానా?' అని, నా చేతిలోని కత్తెర లాగుకుని, మెడదాకా వెంట్రుకలన్నీ కత్తిరించి పారవేశావు. మీ పెత్తండ్రి చూసి విస్తుపోయాడు. 'యిదేమిటి?' అని అడిగారు నిన్ను. నీవు ప్రశాంతవదనంతో 'మహావుక్కబోస్తూ వుంది.' అని తేలిగ్గా అన్నావు. వారూ నవ్వి, అంతేననుకుని కత్తెర తీసుకుని వెంట్రుకలు హెచ్చుతగ్గులు లేకుండా సరిచేశారు. వారూ-నీపెత్తండ్రికదూ!"

సరళ పక్కన నవ్వి- మీ తెలివితేటలకి చెప్పాకోవాలి! అది నా వోర్పును చూపిస్తుందనుకున్నారేమో, కానేకాదు. ఆనాడు మీరు నన్ను ఎంతగా వేధించారో, నేను మిమ్ముల్ని అంతకు తక్కువ వేపుకుతినలేదు. అవునా?" అంది.

"నిజమే, కత్తిరించిన వెంట్రుకలు చూచి నాకు యేడ్పు వొకటే తక్కువ. మరునాడు సిగ్గుతో నీకు ముఖం చూపలేక పోయాను. చదువుకునే గదిలో మెదలకుండా కూర్చున్నాను. నీవువచ్చి చేయిపట్టుకుని లాక్కువెళ్ళావు తోటలోకి, యేమీ జరగనట్టు! ఫాల్గుణమాసంలో గాలివాన వచ్చిననాటి సంగతి గుర్తుందా? తోటలో నా పూరిపాక కప్పు యెగిరిపోయింది. అప్పుడు నీవు వచ్చి—"

"పోనివ్వండి ఆ సంగతులు—" అని దీర్ఘంగా నిట్టూర్చి- ఆరోజులు మళ్ళీరావు" అని సరళ లేచి నిలబడింది.

అతను వ్యాకులపాటుతో సరళచేయి పట్టుకుని- "వద్దు వెళ్లవద్దు. వెళ్ళవలసివచ్చిననాడు-" అని చెపుతూ ఉత్తేజితుడయ్యాడు. "అసలు నీవు ఎందుకు వెళ్ళాలి? ఏం తప్పు చేశా

వని? ఈర్ష్యగాని, అసూయగాని లేదే! పదేళ్ళ నుంచి గృహస్థ జీవితంలో నా పరీక్ష జరుగుతూంది. దాని ఫలితమే యిది! మనమీద దేనికీ కడుపు మంట? అలా అయితే నేను నిన్ను చూచినది మొదలు యిరవై మూడేళ్ళ చరిత్ర తుడిచి వేయాల్సి వుంటుంది!"

"యిరవైమూడు సంవత్సరాలవిషయం నేను చెప్పలేను కాని యీ చివరిదినాల్లో అసూయ చెందటానికి కారణమే లేదంటావా? నిజం వొప్పుకుతీరాలి! ఆత్మవంచనవల్ల ప్రయోజనమేముంటుంది? మీ, నామధ్య ఏ విషయమూ అస్పష్టంగా వుండకూడదు."

అతను కాసేపు స్తబ్ధుగా కూర్చున్నాడు. "ఇప్పుడు అస్పష్టత యేమీ లేదు. నీవులేని ప్రపంచం వ్యర్థమని లోలోపల అర్థమవుతూంది. నా జీవితం ప్రథమ ఘడియల్లో నిన్ను ఎవరి వద్దనుంచి పొందానో, వారు కాక మరెవరూ నిన్ను వేరు చేయలేరు."

"అలా మాట్లాడి కష్టాన్ని పెంపుచేసుకోవద్దు భాయీ, కొంచెం స్థిమితంగా ఆలోచించుకోనివ్వు."

"ఆలోచన మొదలుపెట్టి, వెనుకకు వెళ్ళలేము .మనిద్దరి జీవితం మీ పెత్తండ్రి వొడిలో ప్రారంభించినపుడు, ఆలోచించకుండానే జరిగింది. ఆ దినాలను యెలా నామరూపాలు లేకుండా చెయ్యగలం? సరే, నీ సంగతి నేను చెప్పలేను కాని నావల్ల మాత్రం కాని పని!"

"మీ పాదాలకు మొక్కుతాను, నా మనస్సును బలహీనపరచవద్దు-నా విముక్తిమార్గాన్ని బంధుచేయకండి."

అతను సరళ రెండుచేతులూ పట్టుకుని – "అది విముక్తి మార్గంకాదు సరళా, దాన్ని అలా వుండనివ్వను. నేను నిన్ను ప్రేమిస్తున్నాను; యీ సత్యాన్ని యివాళ యింత సునాయాసంగా చెప్పగలిగినందుకు నా మనసు వుప్పొంగుతూవుంది. ఇరవై మూడు సంవత్సరాలు మొగ్గరూపంలో వున్న పూవు దైవకృపవల్ల నేడు వికసించింది. దాన్ని కప్పిపుచ్చటం పిరికితనము–అధర్మమువుతుందని గట్టిగా చెప్పగలను" అన్నాడు.

"ఇక వూరుకో, యేమీ మాట్లాడవద్దు. ఈ రాత్రికి నన్ను మన్నించు."

"సరూ, నేనే దయజూపతగినవాడిని; జీవితంలో చివరి ఘడియవరకూ తీవ్రమూర్ఖుణ్ణి. ఎందుకు నేను గుడ్డిగా ప్రవర్తించాను? నిన్నెందుకు గుర్తించలేకపోయాను? నేను పొరపడి దేనికి పెళ్ళిచేసుకున్నాను? నీవు చేసుకోలేదే! నిన్ను కోరి యెంతమంది రాలేదు? – అంతా నాకు తెలియకపోలేదు."

"పెదనాన్న పూదోటభారంఅప్పగించారు, లేకపోతే–"

"లేదు, లేదు, నీ మనసులో ఉజ్వల సత్యం విరాజిల్లుతూవుంది. నీకు తెలియకుండానే, ఆ సత్యానికి నీవు కట్టుపడి పోయావు. నన్ను దేనికి మేలుకొల్పలేదు? మనమార్గాలు యెందుకు వేరైపోయినవి?"

"పోనివ్వండి; అంగీకరించవలసినదాన్ని కాదని, ఎవరితో పోట్లాడతారు? అనవసరంగా బాధపడితే, వారికేదేమిటి? తెల్లవారినాక యేదో ఒక నిర్ణయానికి వద్దాము."

"సరే, అలానే వుంచుకుంటాను. కాని యీ వెన్నెల రాత్రి నా తరఫున మాట్లాడటానికి యేదైనా నీ వద్ద విడిచి వెళ్తాను!"

తోట పనికి అతని నడుమున సంచివొకటి వేలాడుతూ వుంటుంది; దానితో ఎప్పుడూ అవసరం వుండేది. అందులో నుంచి నాగకేసరపూలగుత్తి తీసి, — "యీ పూలంటే నీకు చాలా ఇష్టమని యెరుగుదును. నీ భుజంమీంది పమిటపైన పెడతాను. ఇదిగో సేఫ్టీ పిన్ను!" అన్నాడు.

సరళ కాదనలేదు. అతను యిష్టమొచ్చినంత టైము తీసుకుని, పూలు అలంకరించాడు. సరళ లేచి నిలబడింది — అతను యెదురుగా నుంచుని సరళ రెండుచేతులూ పట్టుకుని ఆకాశంలోని చంద్రుని చూస్తున్నట్టు ఆమె మోమువంక చూస్తూ వుండిపోయాడు.

సరళ చేయి విడిపించుకుని పారిపోయింది, అతను ఆమెను అనుసరించలేదు; కనుచూపుమేర, నిలబడి చూస్తూ వున్నాడు. తర్వాత గట్టుమీంద కూర్చున్నాడు.

నౌకరు వచ్చి — "వంట తయారయింది" అన్నాడు.

"ఈపూట భోంచేయను"

## 6

రమేశు గుమ్మంలోనుంచి — "నన్ను పిలిచావా వదినా?" అన్నాడు. నీరజ రుద్ధకంఠాన్ని సవరించుకుని — "రా!" అంది.

గదిలోని వత్తులు ఆర్పి వున్నాయి; కిటికీలన్నీ తెరచి వున్నయి; వెన్నెల నీరజ మోముమీద, పక్కమీద, తల గడన, ఆదిత్యుడు యిచ్చిపోయిన లాబర్నమ్ పూగుత్తి మీద పడుతూవుంది; మిగతా గదిఅంతా కీ నీడలోవుంది. నీరజ దిండునానుకుని వొడ్డిగిలి పడుకుంది — కిటికీ ఆవల దూరా కాశంలోకి చూస్తూ! అటు పొదరింటి అవతల పోక చెట్ల పంక్తులు కనిపిస్తున్నవి. గాలి యిప్పుడే వీచసాగింది. ఆకులు కదులుతున్నవి; మామిడిపూత సువాసనలు గుబాళిస్తున్నవి. దూరాన్నుంచి పల్లెపాట వినిపిస్తూంది. గ్రామీణులు డోలు మీద 'హోళీ' పాడుతున్నట్టుంది. కిందపెట్టిన పళ్లెంలో కొన్ని తీపివస్తువులు, కొంచెం గులామువుంది. దర్వాను కానుక అది! రోగి విశ్రాంతికి భంగం కలుగుతుందేమో నని యింటిల్లపాదీ నిశ్శబ్దంగా వుంది. చెట్లమీద వసంతపక్షుల ఉత్తరప్రత్యుత్తరాలు నడుస్తున్నవి— ఏ పక్షీ పరాజ యాన్ని అంగీకరించేటట్టులేదు. రమేశు స్టూలు లాక్కొని నీరజ మంచంవద్ద కూర్చున్నాడు. యేడుపు వస్తుందని నీరజ చాలా సేపు మాటాడలేదు, ఆమె పెదవులు కంపిస్తున్నవి. వేదనా తరంగాలు ఆమెను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నవి. కాసేపటికి స్థిమితపడింది, లాబర్నమ్ పూగుత్తిలోనుంచి జారిన పూలు రెండూ ఆమె గుప్పెటలో నలిగిపోయినవి. తర్వాత యేమీ మాటాడకుండా, ఒకవుత్తరం తీసి రమేశు చేతికి యిచ్చింది. ఆ వుత్తరం ఆదిత్యుడు వ్రాసింది:—

"దీర్ఘకాల పరిచయానంతరంకూడా, నా నిష్ఠను శంకించగలగటం నాకు చాలా విస్మయాన్ని కలిగించింది. దీనిని

గురించి చర్చించబూనుకోవడం సిగ్గుచేటు. నీ ప్రస్తుత మనస్థితినిబట్టి. నా చేతలు, మాటలు విడ్డూరంగా కన్పించవచ్చు. ఇలా నిష్కారణంగా మనస్సును బాధ పెట్టడం బక్కచిక్కిన నీ శరీరానికి మంచిదికాదు. నీ మనస్సుకు స్వస్థత చేకూరే వరకు నేను. దూరంగా ఉండటమే శ్రేయస్కరం. సరళను యిక్కడనుంచి పంపివేయడం నీ అభిమతమని అర్థము చేసుకున్నాను. అదే చేయవలసి రావచ్చు. ఎంత ఆలోచించినా మరొక మార్గము తోచడములేదు నా చదువు సంధ్యలు అభివృద్ధి అన్నిటికీమూలం- సరళ పెత్తండ్రిఅని, నీతో చెప్పాలి. నా జీవితం సార్థకమవటానికి దారికూడా వారే చూపారు. సరళ వారి స్నేహరాశి; పూర్తి నిస్సహాయురాలు. ఇవాళ ఆమెను విడిచిపెట్టటం అధర్మమవుతుంది. నీ ప్రేమకోసంకూడా యీ అధర్మానికి వొడిగట్టలేను.

నా వ్యాపారంలో మరో కొత్తశాఖ-పూలవిత్తనాలు, కాయగూరల విత్తనాలు అమ్మటం - నెలకొల్పుదామని వొక నిర్ణయానికి వచ్చాను. మానికతల్లాలో యిల్లు వున్న తోట దొరకవచ్చు! సరళను అక్కడే వుంచుతాను. ఈ పని మొదలెట్టటానికి నా చేతిలోడబ్బులేదు. అందుకు యీ తోట తాకట్టు పెట్టాలి. నీవేమీ మనసు కష్టపెట్టుకోవద్దని మనవి! సరళ పెత్తండ్రి వడ్డీలేకుండా ఈ తోటకు పెట్టుబడి పెట్టినసంగతి మరచిపోవద్దు. తన చేతిలోది చాలక బయట అప్పుకూడా తెచ్చాడట నాకోసం. పైగా పూల విత్తనాలు, అంట్లు, అరుదుగా దొరికే పూలమొక్కలు, ఆర్కిడ్, పచ్చిక కత్తిరించే మిషను, ఎన్నో పనిముట్లు దమ్మిడీ తీసుకోకుండా యిచ్చారు.

వారు యింత పెద్దసహాయం చేసివుండకపోతే, ఎక్కడో ముప్పై రూపాయలకు గుమస్తాపని దేకుతుండేవాణ్ణి! నిన్ను పెళ్ళాడే అదృష్టమూ కలిగేదికాదు! నీతో మాట్లాడిన తర్వాత, 'సరళకు నేను ఆశ్రయమిచ్చానా లేక సరళ ఆశ్రయంలో వుండి నేను యిందాకావచ్చానా' అనే ప్రశ్న నా మనస్సులో మెదులుతూవుంది. ఇంతకాలంనుంచి మరచిపోయిన సహజ విషయాన్ని నీవే గుర్తుకు తెచ్చావు. ఆ విషయం నీవ్రూ గుర్తించుకోవాలి. సరళ నా మెడలమీద లేనిపోని భారమని యెప్పటికీ అనుకోవద్దు. వాళ్ళఋణం నే నెన్నటికీ తీర్చుకోలేను. నా మీద వాళ్ళ హక్కుకూ మితిలేదు! సరళ నీ కంటబడదు యెప్పటికీ; కాని మాయిద్దరి బాంధవ్యం విచ్ఛిన్నం కావటానికి వీల్లేదు! ఇదివరకెప్పుడూ యీ విషయం యింత స్పష్టంగా భోదపడలేదు. నేడు నా దుఃఖము మాటలకు అందనిది; అంతా వివరించలేకపోయాను. ఊహించి, అర్థమవుతుందేమో ప్రయత్నించి చూడు! — జీవితంలో నీకుకూడా తెలియకుండా వుంచిన ప్రథమ విషాదగాథ యిదే!"

రమేశు వుత్తరం రెండుసార్లు చదివి మెదలకుండా కూచున్నాడు.

నీరజ వ్యాకులకంఠంతో — "ఏమైనా మాట్లాడు మరిదీ!" అంది.

అప్పటికీ రమేశు మౌనంగానే వున్నాడు.

నీరజ బోర్లపడుకుని తల బాదుకుంటూ— "చాల పొరబాటు పడ్డాను. ఎంతో అన్యాయం చేశాను. మీలో

ఎవరూ, నా మనసు పాడవటానికి కారణం గ్రహించలేక పోయారా?" అన్నది.

"అదేమిటి వదినా, మనసు దిటవుపరచుకో. లేకపోతే ఆరోగ్యం మరీ చెడిపోతుంది."

"ఈ అనారోగ్యమే కొంపకు తిప్పలు తెచ్చింది. ఇంకా దీనిమీద మమకారం చూపనా! వారిని శంకించటమా! ఈ నిరర్థక జీవితాన్ని ఆధారం చేసుకొని నన్ను నేను శంకించుకున్నట్టు కాదూ! ఒకసారి 'మాలినీ' అని మరొకసారి 'వనలక్ష్మీ' అని పిలిచే వారి 'నీరూ' యివాళ ఏమైపోయింది. ఆమె పూదోటను ఎవరు అపహరించారు? నా పేరు ఒకటే ననుకున్నావా మరదీ- వారు పనులన్నీ ముగించుకుని యింటికి వచ్చేటప్పటికి ఆలస్యమైననాడు, వారికోసము ఎదురు చూస్తూ భోజనం ముందుపెట్టుకుని కూర్చునేదాన్ని. అప్పుడు నన్ను 'అన్నపూర్ణా' అని పిలిచేవారు. సాయంకాలం కొలనుగట్టున కూచునేవారు. నేను వెండి పళ్ళెరంలో మల్లెపూలు సర్ది, వాటిమీద తమలపాకులు పెట్టుకువెళ్ళేదాన్ని వారు నవ్వి –"తాంబూల కరండవాహినీ" అనేవారు. అదివరకు కుటుంబ విషయాలన్నీ నాతోనే సంప్రతించేవారు. ఒకసారి 'గృహ మంత్రి' అని మరొకసారి 'హోంశ కటరీ'అని! వొడ్డులొరసి ప్రవహించు శ్రావణ భాద్రపద మాసాల్లోని నదిని కాబోలు! సముద్రంలో కలిసేముందు నా శాఖలు నలువైపులా వ్యాపించినై! నేడు, కనురెప్ప పాటులో చుక్క నీరు లేకుండాపోయింది; రాళ్ళు, ఇసుక బయట పడినై!"

"వదినా, నీకు నయమవుతుంది. తప్పక నీ స్వస్థానం పొందుతావు!"

"లేనిపోని ఆశలు చూపకు మరిదీ! డాక్టర్ల మాటలు నేనూ వింటున్నాను. అందువల్లనే, ఇన్నాళ్ళనుంచి సుఖంగా వెళ్లబుచ్చిన సంసారాన్ని, మళ్ళీపొందాలనే యీ లోభమూ అడియాసానూ!"

"అవసరమేమిటి వదినా! నీవు మొదటినుంచీ వారికోసం నీ సర్వస్వం ధారపోశావు; దానికి మించినదేముంది? యిచ్చిన దానికి ప్రతిఫలం పొందావు. ఎంతమందిస్త్రీలు దీనికి నోచుకున్నారు? కాసేపు డాక్టర్లమాటే నిజమనుకుందాం. ఆ రోజు వస్తే, గొప్పగాపొందినదాన్ని గొప్పగానే యిచ్చివెళ్ళు! నీవు జీవితాన్ని యెంతగౌరవంగా గడిపావో, ఆ గౌరవాన్ని కుంటుపరచుకుని వెళతావా? ఈ యింట్లో నీ చివరిస్మృతి చిహ్నానికి, నూతన మహిమను ప్రసాదించి వెళ్ళు వదినా!"

నా గుండె చెరువై పోతుంది మరిదీ! దీర్ఘకాల ఆసనం దాన్ని యథాప్రకారమేవుంచి, చిరునవ్వుతో వెళ్ళిపోవచ్చును కాని నా విరహచిహ్నంగా మిణుకుమిణుకుమనే చిన్నదీపమైనా వుండే అవకాశంలేదా? ఆ తలపువచ్చినప్పుడు నాకు చావబుద్ధికూడా పుట్టదు. సరళ, అదే సర్వస్వాన్ని భుక్తపరచుకుంటుంది — యిదేనా, విధి న్యాయం.?"

"యదార్థం చెబుతాను, నీవు కోపగించుకోవద్దువదినా. నీవు చెప్పేది నాకేమీ అంతు పట్టటంలేదు. ఇంతకాలంనుంచీ దానం చేసి, ఇవాళ నీవు అనుభవించే అవకాశం లేనప్పుడు కూడా సంతోషంతో యిచ్చివేయలేవా? నీ ప్రేమ పరిహాస

పాత్రంకాదా? సంసారంలో నీశ్రద్ధాదీపాన్ని చేతులమీదుగా తుత్తునియలుచేసి నామరూపాలు లేకుండా చేయాలనివుందా? ఆ వ్యధనుంచి తప్పుకుపోవ జూస్తున్నావు; కాని మా హృదయాల్లో ముల్లుమాదిరి కలకవేయదా? వదినా, నీ జీవితంలో సంపూర్ణ ఔదార్యాన్ని యీ చివరి గడియల్లో, యిలా లోభానికి గురికానివ్వద్దని చేతులెత్తి ప్రార్థిస్తున్నాను."

నీరజ వెక్కి వెక్కి యేడవసాగింది. రమేశు నిశ్శబ్దంగా కూర్చున్నాడు; వోదార్చటానికికూడా ప్రయత్నించలేదు.

కాసేపటికి నీరజ లేచి పక్కమీద కూర్చుని- "నీవు నాకొక భిక్ష పెట్టాలి మరదీ!" అని అడిగింది.

"సెలవివ్వు వదినా"

"విను సరిగ్గా, నా హృదయం లోపల కన్నీటితో నిండి పోయినపుడు నేను ఆ పరమహంస పటంవంక చూస్తుంటాను. కాని వారి సందేశం హృదయందాకా చేరటంలేదు. నా మనస్సు చాలా సంకుచితమైనది. ఎలానైనా నాకు వొక గురువును చూపించు-లేకపోతే యీబంధనాలు తెంపుకోలేను. మాయలోనే చిక్కుకొని వుంటాను. ఆనందంగా జీవితం గడిపిన యింట్లోనే చనిపోయినాక యుగాల తరబడి దుఃఖ వాతావరణంలో రోదిస్తూ తిరుగాడాలి - నన్ను ఇందులోనుంచి వుద్ధరించు మరిదీ!"

"శాస్త్రిలు పామండుడని చెపుతవి నాలాంటివాడినే! వీటిమీద నాకు నామ్మకాలు లేవు. స్నేహితుడొకడు నన్ను బలవంతాన వాళ్ళ గురువుగారివద్దకి పట్టుకెళ్లాడు. కాని దీక్షా

బద్ధుణ్ణి కాకమునుపే పారిపోయి వచ్చాను. చెరసాలకు ఒక వ్యవధి అనేది వుంటుంది; ఈ బంధనాలన్నీ వ్యవధిలేనివి."

"నీ మనస్సు దృఢమైనది. నా బాధను నీవు ఎలాను అర్థం చేసుకోలేవు నేను విలవిలలాడినకొద్దీ కూరుకుపోతు న్నాను నిగ్రహించుకోలేక పోతున్నాను."

"నే నొకమాట చెపుతాను విను వదినా! నీ సర్వ స్వాన్ని మరొకరు గుంజుకుపోతున్నారని అనుకున్నంతకాలమూ నీ హృదయము భగ్గున మండుతూనే వుంటుంది. శాంతి ఎప్ప టికీ లభించదు. కాని కొంచెం తాపీగా కూచుని 'యిచ్చి వేశాను. నా సర్వస్వాన్ని అన్నిటికంటె అమూల్యమైన నా ప్రేమనుకూడా దానంచేశాను' అనిచూడు! గుండెమీదనుంచి బండ తీసివేసినట్టుంటుంది, ఎంత తేలిగ్గా వుంటుందో! మనసు ఆనందంతో నిండిపోతుంది. గునుపుతో పనిలేదు. ఇప్పుడేచెప్పి వెయ్ 'నాకోసమేమీ అట్టిపెట్టుకోను. అంతా దానంచేసి దుఃఖబంధనాలన్నీ తుంచివేసి, నిర్మల మనస్సుతో వెళ్ళటానికి సంసిద్ధమయాను' అని చెప్పు!

"ఆఁ – అలాచెప్పు! మరొకసారి ఆ ముక్తిమంత్రం విని పించు మరిదీ! ఈనాటివరకు యివ్వటంలో ఆనందం అనుభ వించాను. ఇవాళ యివ్వలేకపోతున్నాను. అందుకే యీకష్ట మంతా! ముహూర్తానికి నా సర్వస్వం యిచ్చివేస్తాను. ఇక ఆల సించటం మంచిదికాదు. ఇప్పుడే వారిని పిలువు!"

"ఇవాళకాదు వదినా, ముందు నీ మనస్సును చక్కగా చెప్పుచేతల్లో వుంచు – నీ సంకల్పం సహజరూపాన్ని పొందనివ్వు!"

"కాదుకాదు, ఇక సహించలేను. వారు యీ యింట్లో గాకుండా జపాను యింట్లో వుంటానని చెప్పి వెళ్ళినదగ్గరనుంచీ యీ పక్క చితిలావుంది. వారు తిరిగి రాకపోతే, యీ రాత్రి గడవటం కష్టం; గుండె బద్దలయి చనిపోతాను! నీవు సరళను కూడా వెంటబెట్టుకురా. గుండెలో గుచ్చుకున్న ముల్లు ఇవాళ నిర్మూలం చేస్తాను; నే నేమీ వెనకాడను"

"ఇంకా ఆ సమయం రాలేదు; ఇవాళ కాదులే!"

"సమయం మించిపోతుందేమోనని నా భయం. వెంటనే పిలుచుకురా" అనిచెప్పి, పరమహంసపటంవంక రెండు చేతులు జోడించి "నాకు శక్తినివ్వు, మతిలేని ఈ అధమురాలికి ముక్తి ప్రసాదించు స్వామీ! దుఃఖాలు భగవంతునికి కూడా నన్ను దూరం చేసినవి. పూజచేయటం మానాను. మరిదీ! నీవు ఒకపని చేసిపెట్టాలి. కాదనవద్దు!" అనిఅడిగింది.

"ఏమిటి వదినా?"

"పదినిమిషాలుపాటు నన్ను దేవాలయానికి వెళ్ళి రానివ్వు! నాకు చాలధైర్యంగా వుంటుంది; భయమేమీ ఉండదు!"

"సరేవెళ్ళు; నేను ఆపను!"

"రోషనీ!"

"వచ్చాచమ్మా!"

"నన్ను కొంచెం గుళ్ళోకి తీసుకెళ్ళు!"

"ఎలాలేస్తారు? డాక్టరు—"

"మీ డాక్టరు మాటకు యమధర్మరాజే విలువయివ్వక పోతే, నాదైవానికి చెప్పటానికి వా రెవరు?"

"తీసుకెళ్ళు, యేమీ పర్వాలేదు!"

"నీరజ పనిమనిషి భుజంమీద చేయి మోపుచేసి, గుడికి వెళ్ళింది.

నీరజ అటు వెళ్ళగానే, ఆదిత్యుడు వచ్చాడు. "యిదేమిటి? నీరజ యెక్కడికి వెళ్ళింది?"

"ఇప్పుడే వస్తుంది. గుడికి వెళ్ళింది!"

"గుళ్ళోకా? దాపులో లేదే! డాక్టర్లు కదలవద్దని చెప్పారు"

"డాక్టర్ల మందుకంటె, యిదియెక్కువ గుణమిస్తుంది; దేవుడికి దణ్ణంపెట్టుకుని యిప్పుడేవస్తుంది అన్నాయి!"

ఆదిత్యుడు యేమీ మాట్లాడలేదు.

నీరజకు ప్రత్యుత్తరం వ్రాసినప్పుడు, తన జీవితపటంమీద విధి అదృశ్యహస్తాలతో వ్రాసిపెట్టినది, వెలువలి తాపానికి అకస్మాత్తుగా యిలా ప్రజ్వాలమవుతుందని ఆదిత్యుడు అనుకోలేదు. అతను సరళతో – 'ఇక మనం విడిపోక తప్పదు' అని, చెప్ప వచ్చాడు. కాని తీరా చెప్ప మొదలిడేటప్పటికి, సరిగా నోట, వ్యతిరిక్తపుమాటలు వచ్చినై. వెన్నెలరాత్రి రేవు గట్టుమీద కూచుని, జీవితసత్యం ఆలస్యంగా బోధపడిందని పదేపదే అనుకున్నాడు; దానిని అంగీకరించకుండా వుండటానికి వీల్లేదు. ఇందులో తన తప్పుగాని, సిగ్గిలవలసిందిగాని యేమీలేదు. సత్యాన్ని మరుగుపరచటమే అన్యాయమవుతుంది. తత్ఫలితం యేమైనాకానీ, అలాచేయనని నిర్ణయానికివచ్చాడు. తనజీవన కేంద్రంనుంచి, కార్యక్షేత్రంనుంచి సరళను వేరుచేస్తే, ఆ

ఒంటరితనంలో, ఆ నీరసస్థితిలో తన సర్వస్వం మంటగలుస్తుంది; చివరికి వ్యాపారంకూడా దెబ్బతినిపోతుంది.

"రమేశ్! మా విషయమంతా నీకు తెలుసుననుకుంటాను?"

"ఆఁ. తెలుసు!"

"ఇవాళ నా ఋణవిముక్తి అవుతుంది; దాపరికం లేకుండా విప్పిచెపుతాను!"

"అన్నాయి; నీవు వొంటరివాడివికాదు, నెత్తిమీద బరువు పారవేసి విముక్తి పొందటానికి! అవతల వదినవుంది. సంసారబంధం అంత తేలిగ్గా విడివడేదికాదు."

"మీ వదినమధ్య, నా మధ్య యేర్పడిన భ్రమను ఎప్పటికీ అలా వుండనివ్వను. సరళకు, నాకు వున్న బాంధవ్యంలో తప్పేమీ లేదని నమ్ముతావా?"

"నమ్మకపోవట మేమిటి?"

"ఆ సహజబాంధవ్యం మరుగున పడివున్న గాఢప్రేమను నేను గుర్తించలేకపోయాను. అది నా నేరమా?"

"ఎవరన్నారు?"

"ఇవాళ ఆ విషయాన్ని కప్పిపుచ్చటం మిథ్యాచరణమవుతుంది!"

"కప్పిపుచ్చటం దేనికి? – పటాటోపంగా దాన్ని వ్యక్తపరచవలసిన అవసరంమాత్రం యేమొచ్చింది? వలసినంతవరకు ఆమె స్వయంగానే తెలుసుకుంది. కొద్దిరోజుల్లోనే ఈ చిక్కు విడిపోతుంది. వృథాగా దానితో సతమతమవట మెందుకు?

వదిన చెప్పేది విను ముందు. ఆ తర్వాత నీవు చెప్పవలసినది అదే బోధపడుతుంది"

ఇంతలో నీరజ రావటం చూసి, రమేశు బయటికి వెళ్ళిపోయాడు.

గదిలో ఆదిత్యుని చూడగానే, అతని పాదాలమీద తలపెట్టి, అశ్రుగద్గదకంఠంతో—"నన్ను మన్నించండి; అపరాధం జరిగిపోయింది. ఈనాడు నన్ను విడిచిపెట్టకండి. దూరంగా నెట్టివేయకండి" అంది.

అతను నీరజను లేవదీసి, హృదయానికి హత్తుకుని నెమ్మదిగా పక్కమీద పడుకోబెట్టాడు. "నీరూ, నీ బాధ నాకు తెలియదా ?"

ఆమెకు పట్టరాని దుఃఖం వస్తూంది, ఆదిత్యుడు నెమ్మదిగా ఆమెతల నిమరసాగాడు. నీరజ అతని చేతిని గుండెల మీద పెట్టుకుని "ముమ్మాటికీ నన్ను క్షమించరా ? మీరు ప్రసన్నులు కాకపోతే చనిపోయినాకకూడా శాంతి లభించదు" అంది.

"మనం అప్పుడప్పుడు కీచులాడుకున్నాము కాని ఒక్కనాడయినా మన ప్రేమ ప్రసూనం వాడిలిపోయిందా ?"

"ఇదివరకు మీరెన్నడూ యిల్లువిడిచి వెళ్ళలేదు. ఈసారి ఎందుకు వెళ్ళారు ? ఎవరు మీ హృదయాన్ని యింత నిష్ఠురమొనర్చారు ?"

"నావల్ల అన్యాయం జరిగింది నీరూ, నన్ను మన్నించక తప్పదు."

"అదేమిమాట ? శిక్షించినా, రక్షించినా మీరే నా సర్వస్వం! మీమీద అలిగి, రోషంతో మిమ్మల్ని విచారింపచేయాలనుకున్నందుకే నాకు ఈ స్థితి దాపరించింది మరిదితో సరళను కూడా పిలుచుకురమ్మన్నాను – యింకా రాలేదే!"

ఆ మాట చెవిని పడగానే అతని గుండె దడదడ కొట్టుకుంది. ఈ సమస్యను కనీసం ఈ రాత్రికి తప్పించినా పోను!"

"పొద్దుపోయింది, ఇవాళ కాదులే!"

అదుగో యిద్దరూ గుమ్మంబయట నిలబడినట్టుంది – మరదీ, లోనికి రండి!"

రమేశు సరళను తీసుకు లోనికి వచ్చాడు.

నీరజ పక్కమీదనుంచి లేచి నిలబడింది. సరళ, ఆమె పాదాలనంటి నమస్కరించింది.

"రా చెల్లీ ఇలా దగ్గరకు రా!" అని సరళ చేయి పట్టుకుని తన సరసన కూచోపెట్టుకుంది. తలగడక్రింద వున్న నగలపెట్టిలోనుంచి ముత్యాలహారము తీసి సరళ మెడలో వేసింది. చితిలో నా శరీరం భస్మమయేనాడుకూడా యీ హారం నా మెడలో వుండాలనుకున్నాను. కాని యిదే మంచి పని! జీవితాంతంవరకూ నాతరఫున నీవే యీ హారం పెట్టుకో. పండగవచ్చాలనాడు నేను పెట్టుకునేదాన్ని. నీ మెడలో చూచిన వారికి నేను తలపుకైనా వస్తుంటాను.

"అక్కా యిందుకు నేను అనర్హురాలిని, నన్నెందుకు యిలా సిగ్గుపరుస్తావు అక్కా?"

నీరజ సర్వస్వ దానయజ్ఞంలో ఇదీ ఒక భాగంగా యెంచింది. కాని లోన అణగియున్న మణిజ్వాల నివురు

గప్పిన నిప్పుమాదిరి యీ దానంతో ప్రజ్వరిల్లింది- నీరజకూ అంత స్పష్టంగా అర్ధంకాలేదు. ఈ సన్నివేశం సరళను యెంతగా నొప్పించిందీ ఆదిత్యుడు గ్రహించి - "అది నా కివ్వరాదూ? నేను తప్ప దాని విలువ మరొకరు గ్రహించలేరు. నేను దీన్ని మరొకరికి యివ్వలేదు!" అన్నాడు.

"అది నా అదృష్టం! అయినా నాకేమీ పాలుబోకుండా వుంది. సరళా, యిక్కడనుంచి నీవు వెళతావని విన్నాను. అలా యెన్నటికీ జరగనివ్వను. యీ యింట్లో ప్రతివస్తువుతోనూ నిన్ను బంధించిపోతాను. దానికి చిహ్నమే యీ హారం! యిదే నా బంధనం! నిశ్చింతగా చీకూ చింతా లేకుండా ప్రాణాలు విడవటానికే యిది నీ చేతిలో పెట్టాను."

"పొరపాటు చేస్తున్నావు అక్కా, నన్ను బంధించటానికి చూడవద్దు; అందులో మంచి లేదు."

"అలా అంటావేమిటి సరళా?"

"నేను అందరి సమక్షాన నిజం చెపుతున్నాను. ఇప్పటి వరకు నన్ను విశ్వసించవచ్చు కాని ఇకను వద్దు. నా విధినాకు దక్కకుండా చేసినదాన్ని, మరొకరిని వంచించి, నే నెప్పటికీ గ్రహించలేను. ఇవే నా నమస్కారాలు-వస్తాను! తప్పు నాది కాదు; రెండువేళలా నమ్మి నేను పూజించిన నా దైవానిది! ఇవాళ నాకు ఆ దైవమూ లేనికింద జమ!" అనిచెప్పి సరళ వెంటనే బయటికి వెళ్ళిపోయింది. ఆదిత్యుడుకూడా నిగ్రహించుకోలేక ఆమెను అనుసరించాడు.

"ఇలా జరిగిందేమిటి మరదీ-చెప్పు మాట్లాడవేం?"

"అందుకే సరళను పిలవ వద్దని చెప్పాను"

"ఏం మనస్ఫూర్తిగా నా సర్వస్వమూ అర్పించానే- సరళ యీమాత్రం అర్థం చేసుకోలేకపోయిందా?"

"ఎందుకు అర్థంచేసుకోలేదు?- నీ మనస్సు విప్పారలేదని భావించింది."

"ఎలానూ నా మనస్సు నిర్మలంకాదా? ఇన్ని దెబ్బలు తగిలినా యిన్నికష్టాలు వచ్చినా. నా మనస్సెలా పునీత మవుతుంది? పరమహంసా, నీవైనా కాపాడరాదా! నేను ఎవరి వద్దకు వెళ్ళేది. నా అనేవాళ్ళు నాకు ఎవరు ఉన్నారు.

"నేనున్నాను వదినా, ఆ భారమంతా నేను తీసుకుంటాను. నీవు కళ్ళు మూసుకుని పడుకో!"

"ఎలా నిద్ర పడుతుంది? వారు మళ్ళీ వదలిపెట్టి పోతే చచ్చినా నిద్రపట్టదు."

"వెళ్ళలేరు అది అంత తేలికగాదు. యీమందు తీసుకో నిద్రపడుతుంది"

"ముందువాళ్ళిద్దరూ ఎటువెళ్ళారో చూడుమరిదీ లేకపోతే నేనే బయలుదేరతాను-రేపు పోయేప్రాణాలు యివాళే పోతవి !"

## 7

ఆదిత్యుడు తన వెనుకనే రావటం చూసి – "మీ రెందుకు వచ్చారు ? బాగుండదు వెళ్ళండి. ఇలా మిమ్మల్ని వెనవేనుకుని తిరగనివ్వను !" అని చెప్పింది సరళ.

"తిరగనిస్తావో లేదో అది తర్వాత సంగతి – నేను మాత్రం పెనబడిపోయాను. మంచిగాని చెడుగానీ, యిందులో మనం చేతులమీదగా చేసుకుంది ఏమీ లేదు."

"అవన్నీ రేపు మాట్లాడుదాం. ముందు రోగివద్దకివెళ్ళి పూరడించండి."

"తోటలో మరొకశాఖ పెంచాలనుకుంటున్నా."

"ఇవాళకాదు, తర్వాత చూద్దాం, ఇప్పుడు నాలో ఆలోచించేశక్తికూడా లేదు."

ఇంతలో రమేశువచ్చి – "త్వరగావెళ్ళి వదినకు నిద్ర మందు యివ్వ అన్నాయి! అర్ధరాత్రి కావచ్చింది. ఆమెను ఏమీ మాట్లాడనివ్వవద్దు" అని చెప్పాడు.

ఆదిత్యుడువెళ్ళినాక, సరళ–"రేపు శ్రద్ధానందపార్కులో మీ సభ వుందికదూ?" అంది.

"అవును."

"నీవు వెళ్ళవూ?"

"వెళ్ళవలసినమాటే–కాని ఇప్పుడు మానుకున్నాను."

"ఎందువల్ల?"

"నీకు చెప్పి, లాభమేమిటి?"

"ప్రజలు పిరికిపందని నిందిస్తారు"

"నా అయిష్టులందరూ ఎలానూ నిందిస్తారు!"

"అయితే నా మాటవిను, నేను నీకు విముక్తి చూపుతాను. నీవు సభకి తప్పక వెళ్ళాలి."

"ఇంకొంచెం విడమరిచి చెప్పు!"

"నేనూ జండా చేతపట్టుకుని సభకు వస్తాను"

"అర్థమయింది."

"పోలీసు లడ్డగిస్తే కాదనను ; నీవు అడ్డుచెపితేమాత్రం అంగీకరించను."

"సరే, నేనడ్డు చెప్పను."

"నమ్మకమేనా?"

"ఆఁ"

"మనిద్దర్ం అయిదింటికి కలిసివెళ్ళుదాం."

"అలానే – వెళ్దాము కాని ఆ దుర్మార్గులు తర్వాత మనలను వొక్కచోట వుంచరు!"

ఇంతలో ఆదిత్యుడు వచ్చాడు. సరళ "యిదేమిటి? అప్పుడే వచ్చేశారే"అని అడిగింది.

"మాట్లాడుతూ మాట్లాడుతూనే రెండునిమషాల్లో అలసి, సొమ్మసిల్లి నిద్రపోయింది నేనూ నెమ్మదిగా యిటు వచ్చాను.

"నాకు పనుంది వస్తాను!"

సరళ నవ్వుతూ–"ఇల్లు శుభ్రం చేయించివుంచు-మరచి పోయేవు!"అంది.

"ఏం పర్వాలేదు; యెరిగిన తావే!" అని రమేశు వెళ్ళిపోయాడు.

# 8

సరళ కూర్చున్న తావునుంచి లేచి నిలబడి– "మీ కొక దణ్ణము పెడతాను; ఇవాళ నాతో చెప్పరాని మాటలేవీ చెప్పకండి"

"భయం వద్దు. యేమీ చెప్పను,"

"సరే నేనే కొంత చెప్పాలిసివుంది. ముందు నా మాటొకటి నిలుపుతారా? చెప్పండి!"

"నిలపదగ్గదయితే అవశ్యం పాటిస్తానని నీకూ తెలుసు!"

"నేను దగ్గరలేనిదే పనిపాటలు సాగవని తెలుసు. అక్కగారికి సేవచేసేభాగ్యం లభిస్తే బాగుండేది. కాని నే నందుకు నోచుకోలేదు! నేను వైదొలగివుంటమే మంచిది. ఆగండి, నన్ను పూర్తిగా చెప్పనివండి. డాక్టర్లు ఆమె యెక్కువరోజులు జీవించదని చెప్పారు. ఈ లోపు వారి మనో కంటకాన్ని నీవు నిర్మూలం చెయ్యాలి. వారి జీవితంమీద నా నీడకూడా పడకుండా చూడండి."

"నాకు తెలియకుండానే జరిగితే నేనేంచేయను చెప్పు!"

"లేదు లేదు-మీరు మమ్మల్ని అలా తక్కువచేసి మాట్లాడవద్దు. సాధారణ భారతీయులమాదిరి మీ మనస్సు బంకమన్నుతో తయారైంది కాదని నాకు తెలియదూ?" అని అతని చేయి పట్టుకుని- "నాకోసమైనా మీరు యీ వ్రతం అవలంబించాలి. యీ చివరి రోజులలో ఆమె మనస్సునేమీ కష్టపెట్టవద్దు: కనికరంతో చూడండి. ఆమె కాపురం నష్టపెట్ట మంచటానికి నేను వచ్చినసంగతినే మీ మనసులోకి రానివ్వకండి" అని బ్రతిమిలాడింది.

అతను నిశ్శబ్దంగా నిలబడివున్నాడు.

"మాటయివ్వండి!"

"అలానే, కాని నీవుకూడా నాకొకమాటయివ్వాలి!"

"మీ రిచ్చినమాట సాధ్యమవుతుంది; కాని నావద్ద తీసుకున్నమాట సాధ్యమవదేమో నని నా భయం!"

"కాదు, అసాధ్యమైనదికాదు"

"అయితే, చెప్పండి."

"మనస్సులో అనుకునేమాట నీవద్ద చెప్పటంలో తప్పేమీలేదు. నీవు చెప్పినప్రతిమాట వింటాను, అక్షరాల పాటిస్తాను. కాని నీవు నా జీవితంలోని శూన్యతను నింపుతావని ముందు నాకు గట్టిగా తెలియాలి. ఏం, మాట్లాడవేం?"

"మాట దక్కించుకోవటానికి మధ్యలో యెప్పుడు యేమిఅడ్డంకులు వస్తాయో యెలా తెలుస్తుంది?"

"ముందుగానే చెప్పు, అడ్డంకి మానసికంగానా?"

"ఎందుకు నన్ను బాధిస్తావు? భాషలో పెట్టేటప్పటికి, కాంతి తరిగిపోయే భావా లుంటవని మీ రెరుగరా?"

"సరే, మాటతీసుకునే పోతున్నాను!"

"వెను దిరిగిచూడరుగదా?"

"లేదు, కాని నీ మోముమీద అన్యక్తప్రతిజ్ఞాముద్ర వేయాలనిపిస్తూంది."

"సహజ, స్వాభావికమైన విషయాల్లో బలవంతం కూడదు. ఇప్పుడుకాదులెండి!"

"సరే, ఎక్కడికి వెళ్ళతావు, ఏం చేద్దామని?"

"ఆ భారమంతా రమేశు తీసుకున్నాడు."

"రమేశు ఆశ్రయమిస్తాడా? ఆ దౌర్భాగ్యుడికి ముందు కొంప వొకటి వుందా?"

"ఆ చింత అక్కరలేదు గట్టి ఆశ్రయమే! స్వంతఆస్తి కాకపోయినా, అడ్డు చేస్తూ వుండదు."

"మాటమాత్రం నా చెవిని వేయండి!"

"అవశ్యం! కాని యీ లోపు మీరునన్ను చూడటానికి విచలితులు కావద్దు."

"నీ మనస్సు వ్యాకులపడుతుందేమో?"

"ఆ అంతర్యామికితప్ప, రెండో కంటివాడికి తెలియదు"

"మంచిది, కాని వెళ్ళుతూ నా భిక్షాపాత్రను శూన్యంగా వుంచే సెలవిస్తావా?"

పురుషుని నేత్రాలు చెమ్మగిలినవి.

సరళ దగ్గరికివచ్చి నిశ్శబ్దంగా తన మోము పైకెత్తింది.

## 9

"రోషనీ!"

"ఏమిటమ్మా!"

"నిన్న వుదయంనుంచి సరళ కనిపించటం లేదే!"

"మీకింకా తెలియదా ? గవర్నమెంటు అరెస్టుచేసి కేసుపెట్టింది."

"ఎందుకట ?"

"దర్వానును కూడగట్టుకుని, వైస్రాయి పడకగదిలోకి జొరబడిందట"

"ఎందుకు?"

"అక్కడ వుండే మహారాణీ మొహరుకాజేసుకు రావటానికి ! తిన్నగా వ్రేలెడు లేదు; ఎంత గుండెగలదోచూడు !"

"కాజేస్తే వారిగే దేమిటి?"

"వారిగే దేమిటా! ఆ మొహరు చేతికివస్తే యింకేం కావాలి? వైస్రాయికి కూడా వురిశిక్ష విధించవచ్చు. రాజ్యం నడిచేది ఆ మొహరుతోటేగా?"

"మరిది యెక్కడ?"

'ఆయన తలపాగాలో కన్నపు సామాను దొరికితే ఆయనమీాదా కేసుపెట్టారు. జైలులో పాతికేళ్ళు రాళ్ళు పగలగొట్టే పని తప్పదు. అమ్మాయిగారూ, సరళమ్మగారు వెళ్ళేటప్పుడు మంచి పట్టుచీర యిచ్చి వెళ్ళింది, నా కోడలి కోసమని. నా కళ్ళలో నీరు తిరిగింది. పాపం ఆమెను చాలా తిప్పలుపెట్టాను. ఆ చీర నావద్దవుంటే. గవర్నమెంటు నన్ను కూడా పట్టుకుపోతుందా?"

"నీకేమీా భయంలేదులే! బయటి గదిలో పత్రిక వుంటుంది. వెళ్ళి తీసుకురా!"

పత్రిక చదివింది. వారు తనతో మాటమాత్రమయినా అనలేదే! అశ్రద్ధచేతనా? 'ఆవిడ జైలుకువెళ్ళి జయం పొందింది. నాకు వొంట్లో పసిగావుంటే, నేను వెళ్ళేదాన్ని కానూ! చిరునవ్వు నవ్వుతూ నేనూ ఉరికంబం యెక్కగలను'

"రోషనీ చూశావా మీా చిన్నమ్మపని? పరువు ప్రతిష్ఠలుగల కుటుంబంలో పుట్టి, నడిబజారులో మగవాళ్ళ సమక్షం—"

పనిమనిషి మధ్యలోనే అందుకుంది. "నా గుండె పీచు పీచు మంటుంది. బందిపోటు దొంగలు నయమనిపించారు. ఛీ, ఛీ!"

"అన్నిటికీ నేను ఉన్నానని బయలుదేరుతూంది వీరాంగనవంటిది. సిగ్గువిడిచి వే స్తేసరి! పూదోటనుంచి చెరసాల దాకా – ప్రాణాలమీదికి వచ్చినా అభిమానం పోలేదు!"

పనిమనిషికి పట్టుచీర సంగతి గుర్తుకొచ్చింది. "కాని చిన్నమ్మది భారీచెయ్యి. రెండుచేతులా దానం చేస్తుంది."

ఈ మాట నీరజను నొప్పించింది. కాని మళ్ళీ అంతలోనే తెప్పరిల్లింది. "నీవు చెప్పేది నిజమే రోషనీ! నేను మరచేపోయాను. ఆరోగ్యం చెడితే, మనస్సూ చెడుతుంది. ఇప్పుడు నేను యెంత దిగజారిపోయాను! ఛీ, ఛీ ఆత్మహత్య చేసుకో బుద్ధి పుడుతూంది. సరళ నిజాయితీ గలది; అబద్ధ మెరగదు. ఇలాంటివాళ్ళు చాలా అరుదుగా ఉంటారు. నాకంటె చాల యోగ్యురాలు! ఒకసారి గుమాస్తాను యిటు పంపు."

నీరజ కాగితం, పెన్సిలు తీసుకుని ఉత్తరము వ్రాయ బూనుకుంది. ఇంతలో గుమాస్తావచ్చాడు. "ఈ ఉత్తరం జైలులో సరళవద్దకి చేర్చుతారూ?"

గుమాస్తాకు తనశక్తి సామర్థ్యాలమీద చాలా విశ్వాసం. "తప్పక చేరుస్తాను. కాని డబ్బు ఖర్చువడాలి. పోలీసుల చేతులగుండా పోవాలిగదూ ఉత్తరం. అందులో ఏమివ్రాశారో ఒకసారి వినిపించండి."

నీరజ చదివింది. "నీ గొప్పతనానికి, సాహసానికి నా ధన్యవాదాలు! నీవు జైలునుంచి వచ్చేటప్పటికి మనమార్గాలు యేకోన్ముఖమవుతవి."

"మార్గమనేమాట బాగున్నట్టులేదు. సరే, ప్లీడరుకు చూపి సరిచేయిస్తాను" అని గుమాస్తా వెళ్ళిపోయాడు.

నీరజ లోలోపల రమేశుకు సమస్కరించి– 'మరిదీ! నీవు నాకు గురుతుల్యుడివి!' అనుకుంది.

## 10

ఆదిత్యుడు గదిలోకి మందు తెచ్చాడు.

"మళ్ళీ యేదో తెచ్చారే?"

"డాక్టర్లు గంట గంటకు మందు యివ్వమని చెప్పారు"

"మందుయిచ్చే మనుషులు లేకపోయారా? అంతగా అయితే పగలు నర్సును పెట్టండి."

"పరిచర్యమిషతో నీ వద్దవుంటానికి అవకాశంచిక్కితే, దాన్ని యెందుకు జారవిడవాలి?"

"ఇంతకంటెమీరు తోటపనిచూస్తుంటే యెక్కువసంతో షిస్తాను. నేను మంచమెక్కాను, తోట ఆరుమూడవుతూంది."

"అయితేమానె! ముందు నీకు వొంట్లో వుసులుబాటు చిక్కనివ్వు, మళ్ళీ మనిద్దరం తోటపనిచూద్దాము."

"సరళవెళ్ళిపోయింది; మీకు వొంటరివాళ్ళుఅయూరు. మీకు పనిచేయ బుద్ధిపుట్టటంలేదు. కాని, ఏంచేస్తాము — తోట పాడుపెట్టుకోముగదా?"

నేనది ఆలోచించటంలేదు నీరూ; నీవు తోటపనిఅంటే వ్యాపార మనే తలపు రాకుండాచేశావు; కనుకనే పని అంటే అప్పుడు ప్రాణాలు లేచి వచ్చేవి!"

"ఎందు కంత దిగాలుపడిపోతారు? నిన్నటిదాకా బాగానే పనిపాటలు చేస్తుంటిరి! కొన్నాళ్లపాటు యిబ్బంది కలిగితే, అలా వ్యాకులపడతారా?"

"ఫాను వదలనా?"

"యీ పనులన్నీ మీవి కావు. మీ ఆదుర్దా చూచి నేను చాలా యిదవుతున్నాను. కాలం గడవకపోతే అలా 'హార్టికల్చర్ క్లబ్'దాకా వెళ్ళిరాకూడదూ?"

"లిల్లీపూలు ఇవాళ తోటంతా గాలించినా, ఒక్కటీ దొరకలేదు. నీ కివ్వటానికి, ఈసారి వర్షాలు సరిలేక మొక్కలు యేపుగా ఎదిగిరాలేదు."

"ఎందుకా వుబుసుపోక కబుర్లు? హరియాని యిటు పంపండి- ఇక్కడనుంచే తోటపని చేయిస్తాను. నేను మూల పడితే తోటగూడా మూలబడాలా? చెప్పేమాట వినండి- ఎండిపోయిన పూలమొక్కలన్నీ పీకించి మళ్ళు బాగుచేయించండి. మెట్లక్రిందగదిలో ఆవపిండిబస్తా వుండాలి. గదితాళం హరియాదగ్గర వుంది."

"పిండిబస్తా వుందా? హరియా చెప్పలేదే!"

"వాడికి యిష్టంలేకకాబోలు! మీరందరూ వాణ్ణి వేపుకు తిన్నారు! కొత్తఆఫీసరు అనుభవం గడించిన క్లర్కును ఆదరించని మాదిరిగా మీరు వాడిని చూశారు!"

"వాడినిగురించి నిజంచెబితే అప్రియసత్యమవుతుంది."

"సరే నేను మంచాన పడివుండే, వాడిచేత పనిచేయిస్తాను. ఇక తోట యెలావుంటుందో చూడండి. తోట ప్లాను,

నా డైరీ యిలా యివ్వండి, నేను చక్కగా గుర్తులు పెట్టి వుంచుతాను."

"అందులో నా ప్రమేయమేమీ వుండదా?"

"ఊహుఁ - వెళ్ళేముందు తోటలో నా వ్యక్తిత్వాన్ని ముద్రించిపోతాను. రోడ్డుప్రక్కన 'పామ్స్' తీసివేసి, మంచి మొక్కలు, చెట్లు పెంచాలి. మీరు అలా కాదనకండి అంతా తయారయినాక చూడండి. మీ 'లాన్' కూడా వుంచను. అక్కడ చలవరాతి అరుగు కట్టిస్తాను?"

"బాగుంటుందా? చౌకబారు నవాబు దర్గామాదిరి వుంటుందేమో!"

"మీకెందుకు, మీరు అలా చూస్తూ కూర్చోండి. కొంతకాలంపాటు యీ తోట నా వొక్కదానిదే; యెవరికి యేమీ సంబంధంలేదు. తోట చక్కగా తయారుచేసి, మీ చేతికిచ్చి వెళ్తాను. నా శక్తి సామర్థ్యాలు సన్నగిలినవనుకుంటు న్నారుకదూ, కొంచెం వోపికపట్టి చూడండి! - యిద్దరు ముగ్గురు మాలీలు, ఒక అరడజనుమంది కూలీలు కావాలి. నాకు తోట 'అలంకరించటం' చేతకాదన్నారుకదూ ఒక నాడు! అదీ పరీక్షించవచ్చు! తోట నాదనీ, ఇందులోనుంచి నా స్వత్వము ఎప్పటికీ పోదనీ గుర్తించుకోండి!"

"మంచిది, చాలా బాగుంది - మరి నేను యేమి చేస్తుండాలి"

"మీరు వ్యాపారమూ, ఆఫీసుపనీ చూసుకోండి!"

"అయితే నీ పరిచర్య విషయం?"

"ఊహుఁ. ఎల్లవేళలా దగ్గరవుండదగిన 'నీరూ'ను కాదివ్వాడు! మరొకరిని, మీ స్మృతికి తీసుకురానటానికిమాత్రం వుపకరిస్తాను – దానివల్ల ప్రయోజన మేమిటి?"

"మంచిది, నీవు కోరినప్పుడే వస్తాను. కబురుపంపు. ఇవాళ గంధరాజపూలు తెచ్చాను; పక్కమీద వుంచాను – మరొకలా యెంచవద్దు!" అని లేచి నిలబడ్డాడు.

నీరజ అతనిచేయిపట్టుకుని –కాదు 'కొంచెంకూర్చోండి!' అని, కుండీలోని పూవువంక సైగచేసి–"దానిపేరు తెలుసా?" అని అడిగింది.

ఆమెకు ఏమని జవాబిస్తే, సంతోషిస్తుందో అతను యెరుగు; అందుకని బొంకాడు: "లేదు, నాకు తెలియదు."

"నేను చెప్పనా? 'పెట్యూనియా.' మీ దృష్టిలో నా కేమీ తెలియదని! మూర్ఖురాలికిందలెక్క!"

ఆదిత్యుడు నవ్వి – "నీవు సహధర్మిణివి. నీవు మూర్ఖురాలివయితే, నేనుమాత్రం యెలా కాకుండావుంటాను? మూర్ఖత్వవ్యాపారం మనిద్దరిజీవితాల్లో సైదోడుగానే సాగుతూంది!" అన్నాడు.

"ఆ మాత్రం అదృష్టమూ? – ఏనాడో మన్ను దుమ్ము అయింది. పోగతాగే ఆ దర్వాను కొన్నాళ్ళపిమ్మట వచ్చి చూసినా, సింహద్వారంవద్ద కనిపిస్తాడు; నేనుమాత్రంవుండను. ఆ బొగ్గువేసిపోయే యెడ్లబండి రోజూ యిలానే వస్తూపోతూ వుంటుంది; కాని నా హృత్తంత్రి పనిచేయటం మానుతుంది"

నీరజ హఠాత్తుగా భర్తచేయిపట్టుకుని నొక్కి – "నేను వుండను, నాదిఅనేది యేమీ వుండదు. మీరుచాలాగ్రంథాలుచదివారు.

మీకు తెలిసేవుంటుంది. సర్వమూ తుడుచుకుపోతుందా''? అని అడిగింది.

"నేను చదివిన గ్రంథాలవరకే నాకు తెలుసు. అవన్నీ యమధర్మరాజువద్దకే చేరినవి. తర్వాత యేమిజరిగేదీ చెప్ప లేదు !''

"మీ ఉద్దేశమేమిటో చెప్పండి. నా చిహ్నమే ఉండదా ? నామరూపాలు లేకుండా పోతుందా ? అస్తిత్వమే ఉండదా ?''

"ఇప్పుడు సంభవమయితే ముందు ఉండటమూ సంభవమే !''

"అసంభవ మెన్నటికీకాదు ! ఈ తోట ఉండటం సంభ వమా, నే నేమో అసంభవమా ! అసలు అలా జరగటానికే వీల్లేదు. రోజూ మసకచీకటి పడుతుండగా, కాకులు యిలానే వస్తుంటవి, పోకచెట్లమీద యిలానే ఉయ్యాల లూగుతుంటవి నా కళ్ళముందట! ఆనాడు నేను ఉన్నానని గుర్తించుకోనండి. నేను ఈ పూదోటంతటా వ్యాప్తమైవున్నాను. పిల్లవాయు వులు మీ ముంగురులతో ఆడుకొనేటప్పుడు, నేను ముని వేళ్ళతో స్పృశిస్తున్నానని గుర్తుంచుకుంటారా? చెప్పా రేమండి?''

ఆదిత్యునికి 'గుర్తుంచుకుంటా'నని చెప్పకతప్పలేదు. కాని ఆమెలో నమ్మకం కలిగించే తీరులో చెప్పలేకపోయాడు.

నీరజ విచలితురా లయింది. "మీ గ్రంథకర్తలందరూ పెద్ద పండితులేం ? వాళ్ళకేం తెలుసు – నా తలకాయ ! నాకు గట్టిగా తెలుసు, నా మాట నమ్మండి. నేను యిక్కడే

మీావద్దనే ఉంటాను. అది నాకు కళ్ళకు కట్టినట్టు కన్పిస్తూ ఉంది. మీాతో వొట్టుపెట్టుకుని చెప్పిపోతున్నాను – నేను వెనకటికంటె కూడా చక్కగా మీా తోట అజమాయిషీ చేస్తుంటాను. అందుకు మరెవ్వరూ అవసరంలేదు'' అని చెప్పింది.

నీరజ దిండుమీాద మోచెయ్యి ఆనించి కూచుని – ''నన్ను కనికరించండి మీామీాద నాకువున్న ప్రేమ చూసి అయినా నామీాద దయచూపండి. ఇంతకాలంనుంచి మీారు నన్ను ఎలా ప్రేమించారో యెలా మీా హృదయంలో నాకు వున్నత స్థానమిచ్చారో అలానే ముందుకూడా చూడండి! సీజనులో వికసించేపుష్పాలను, మనస్సులోనే నా చేతికియిస్తూ ఉండండి. మీారు నిష్ఠురులయితే నేనిక్కడ వుండలేను. నా పూ దోటను భుక్తం జేసుకుంటే గాలిలోపడి నేను యెక్కడికని తిరగను?'' అని చెపుతూండగానే కన్నీటి చుక్కలు టపటపా రాలినాయి.

ఆదిత్యుడు లేచి పక్కమీాదకి వచ్చికూచుని నీరజ మోము హృదయానికి హత్తుకుని నెమ్మదిగా ఆమెతల నిమర నారంభించాడు. ''నీరూ నీ ఆరోగ్యం పాడుచేసుకోవద్దు.''

''ఈ పాడుకట్టె యెలా తగలబడితేనేం? మీా పూ దోట మీారువుంటే నా కదే చాలు. నామాట ఆలకించండి. కోపం తెచ్చుకోకుండా!'' అని చెపుతుండగానే ఆమెగొంతు జీరపోయింది. మళ్ళీ కొంచెం స్థిమితపడి చెప్పనారంభించింది. నేను సరళకు అన్యాయం చేశాను. నన్ను మన్నిం

చండి. నన్ను ఎప్పటిమాదిరే ప్రేమించండి. మీరు చెప్పినట్లు నడుచుకుంటాను."

"శరీరంతోపాటు నీ మనస్సుకూడా అనారోగ్యమైంది నీరూ. అందువల్లనే వృథాగా యింతగా నిన్ను నీవు కష్టపెట్టుకున్నావు!"

రాత్రి నేనొక నిర్ణయానికి వచ్చాను. నా మాట నమ్మండి. సరళ రాగానే, నా స్వంత చెల్లెలివలె మనస్ఫూర్తిగా హృదయానికి హత్తుకుంటాను. నా మాట దక్కటానికి మీరు కొంచెం సాయపడండి. చెప్పండీ! – మీ ప్రేమకు నేను దూరం కాకుండావుంటే చాలు, అందరికీ నా ప్రేమను పంచిపెట్టగలను!"

ఈ మాటకు అతనేమీ జవాబివ్వకుండా పదేపదే ఆమె మోమును ముద్దుపెట్టుకోసాగాడు. నీరజ కనులు మూసుకుంది. కొంచెం సేపటికి నీరజ ఉన్మీలిత నేత్రాలతో –"సరళ జైలునుంచి యెప్పుడు వస్తుందా అని రోజులు లెక్కపెడుతూ కూర్చున్నాను. ముందుగానే యెక్కడ రాలిపోతానో! సరళా, నీపట్ల నా మనస్సు నిర్మలమైంది అని చెప్పే అవకాశమైనా దొరుకుతుందో లేదో!" అని చెప్పింది.

"మైనపువత్తి వెలిగించి మీరు కాసేపు యీ పుస్తకం చదివి వినిపించండి" అని అడిగి నీరజ దిండుకిందనుంచి తీసి, అతనికి అందించింది.

అతను పుస్తకము చదివి వినిపించసాగాడు.

కొద్ది క్షణాలకే నీరజకు కునుకుపట్టింది. ఇంతలో పనిమనిషి "ఇదుగో ఉత్తర"మంటూ వచ్చింది.

నీరజ త్రుళ్ళిపడి లేచింది. ఆమె గుండె తీవ్రంగా కొట్టు కొన నారంభించింది. అతనికి యెవరో స్నేహితుడు వ్రాశాడు. 'చెరసాలలో స్థలాభావంవల్ల శిక్ష పూర్తి కాకుండానే, కొంత మంది ఖైదీలను విడిచిపెడుతున్నారు. వారిలో సరళపేరుకూడా వుంది, అతని మనసు సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయింది. కాని ఆ సంతోషం పైకి కన్పించకుండా ఉంటానికి శాయ శక్తులా ప్రయత్నించాడు.

"ఆ ఉత్తరం యెవరు వ్రాశారు? విశేషాలు ఏమిటి?"

చదివి వినిపిస్తుంటే తనకంఠస్వరం కంపిస్తుందేమోనని ఆదిత్యుడు ఉత్తరం ఆమెచేతికి యిచ్చాడు. నీరజ అతని ముఖంవంక తేరిపారజూసింది, అతనేమీ మాటాడలేదు; కాని ఆ అవసరంమాత్రం యేముంది? నీరజనోటగూడా మాట రాలేదు. కొద్దిక్షణాలకు మనసు చిక్కబట్టుకుని–"ఇక నేచింతా లేదు. ఇవాళే విడిచిపెడతారు, వెంటనే నా వద్దకి తీసుకురండి సరళను!" అంది.

"అరెరె, ఏమిటి నీరూ? డాక్టరు ఉన్నాడా? యెవ రక్కడ?"

"ఆఁ, బయటిగదిలో కూర్చుని ఉన్నారు."

"వెంటనే పిలుచుకురా — రండి – డాక్టరుగారూ, చక్కగా మాటాడుతూనే స్పృహతప్పిపోయింది."

డాక్టరు చేయిచూచి మౌనంగా ఉన్నాడు.

కొంచెంసేపటికి రోగి కన్నుతెరచి–"డాక్టరుగారూ సర ళను చూసేదాకా నా ప్రాణాలు నిలపాలి మీరు. సరళను ఆశీర్వదించాలి. చివరి ఆశీర్వాదం!" అంది.

మళ్ళీ రెప్పలు మూతపడినవి. గుప్పిట బిగుసుకుపోతూ ఉంది. మరిదీ, మాటదక్కించుకుంటాను నువ్వెప్పటికీ! లోభి మాదిరి యెప్పటికీ చనిపోను!

మధ్య మధ్య ఆమె చైతన్యం కోల్పోతూ ఉంది. బాహ్యప్రపంచమంతా చీకట్లు ముసురుతున్నట్లుంది. ఆరిపోయే దీపంమాదిరి ఆమె జీవజ్యోతి గప్పుగప్పుమని వెలుగుతూంది.

నీరజ మధ్య మధ్య "సరళ యెప్పుడు వస్తుం"దని అడిగేది. ఒకొొకసారి పనిమనిషిని పిలిచి, "మరిదిని యిక్కడ ఉన్నట్టుగా వెళ్ళి తీసుకురా!" అనేది. మళ్ళీ తనలోతాను "నాగతి యేమికాను మరిదీ! ముమ్మాటికీ నా సర్వస్వం దానం చేసి వెళ్తాను' అంటుండేది"

# 11

రాత్రి తొమ్మిది అవుతూంది. రోగి గదిలో ఒకమూల మైనపువత్తి వెలుగుతూవుంది. సంపంగి, జాజి సువాసనలు గాలిలోకలిసి గుబాళిస్తున్నవి. కిటికీలోనించి తోటలో చెట్ల దట్టమైననీడలు పైన ఆకాశంలో కాలపురుషుని తారకలు కన్పిస్తున్నవి.

ఆదిత్యుడు రోగికి నిద్రాభంగం జరుగకుండా, సరళను వాకిట్లోవుంచి, నిశ్శబ్దంగా నీరజ మంచంవద్దకు వచ్చాడు. జపం చేస్తున్నట్టు ఆమెపెదవులు కదులుచున్నవి. మోముమీద చైతన్యాచైతన్య ఛాయలు దోబూచులాడు తున్నవి; అందువల్ల మోము విహ్వాలముయినట్టుంది.

అతను దగ్గరికివెళ్ళి చెవిలో-"సరళవచ్చింది"అన్నాడు.

నీరజకొంచెం కన్ను తెరచి "వెళ్ళండి!"అని, "మరదీ" అని కేక వేసింది.

సమాధానం రాలేదు.

సరళ లోనికివచ్చి నీరజపాదాలు తాకగానే, ఆమెకు ఎలెక్ట్రిక్ షాక్ తిన్నట్టుంది; పాదాలువాటంతటవే ముడుచుకు పోయినవి. నీరజ జీరపోయిన రుద్ధకంఠంతో—"దానం చేయ లేకపోయాను, నా వల్ల కాదు, ముమ్మాటికీ నావల్ల కాదు" అనిచెప్పింది.

ఆమెకు వొంట్లో అసహజమయినబలం వచ్చినట్టుంది. కనుక గ్రుడ్లుపెద్దవై, చింతనిప్పులమాదిరి మండుతున్నవి. ఆమె సరళచేయి గట్టిగా పట్టుకుని నొక్కింది; కంఠము తీవ్రమయింది. "లేదు, నీకు యిక్కడ తావులేదు. రాక్షసీ! లేదు; ముమ్మా టికి నేనే వుంటాను."

హఠాత్తుగా బక్కచిక్కి, పాలిపోయిన ఆ యెముకల పోగు మంచంమీదనుంచి లేచి దిగి, నిటారుగా నిలబడి విచిత్ర కంఠంతో - "పో, ఇక్కడనుంచి అయిపులేకుండా పారిపో! నీ గుండెలుచీల్చుతాను. నీ రక్తం త్రాగుతాను" అనిఅరిచింది.

మరుక్షణమే నీరజ విరుచుకుపడిపోయింది నేలమీద.

ఆ కంఠధ్వనికి ఆదిత్యుడు లోనికి పరుగెత్తుకొచ్చాడు. జీవశక్తినంతా కూడదీసుకొని పలికిన నీరజ చివరిమాటలు అప్పటికే గాలిలో కలిసిపోయినవి!

—o—

# దృష్టిదానం

ఈ కాలపు ఆడపిల్లలు చాలామంది స్వప్రయత్నంతోటి యేరికోరి వివాహాలు చేసుకోవలసివస్తుందని విన్నాను. నేనూ అలానే చేశాను కాని అందులో దైవం తోడ్పాటు వుంది. నేను చిన్నతనంనుంచి అనేకనోములు నోచాను, వుపవాసాలు చేశాను; నిత్యమూ శివపూజ చేస్తుంటాను.

నాకు యెనిమిదోయేటనే వివాహమయింది. కాని పూర్వజన్మ దుష్కృతంవల్ల కాబోలు, గుణవంతుడైన భర్త లభించినప్పటికీ వారిని పూర్తిగాపొందలేకపోయాను. త్రినయనీ మాత నా రెండు నేత్రాలూ తీసుకుంది — జీవితంలో చివరి ఘడియదాకా భర్తదర్శనం చేసుకునే సౌభాగ్యాన్ని ప్రసాదించలేదు.

బాల్యంనుంచీ నాకు అగ్ని పరీక్ష ప్రారంభమయింది. పదునాలుగోయేడు వెళ్లకముందే, నేనొక చావుబిడ్డనుకన్నాను; నేనూ మృత్యువాత పడ్డంతపని అయింది. కాని జీవితంలో కష్టాలు అనుభవించవలసివున్నప్పుడు చావు మాత్రం యెలా వస్తుంది? ప్రకాశించటానికి నిర్మించబడిన దీపంలో చమురు తక్కువగా ఉండదు; అది రాత్రంతా వెలిగిగాని ఆరిపోదు.

మృత్యుముఖంనుంచి బయట పడ్డానుకాని శారీరక దౌర్బల్యం వల్లనో, మరి మానసిక దుఃఖంవల్లనోగాని కండ్లకు జబ్బుచేసి పోట్లు రాసాగినయి.

నాభర్త అప్పుడు మెడికల్ కాలేజీలో చదువుతున్నారు. నూతనవిద్య నభ్యసించే వుత్సాహంలో, చికిత్స చేయటానికి అవకాశం చిక్కితేచాలు. చాలా సంతోషపడినాడు. నా కళ్ళకు జబ్బుచేయగానే వారే చికిత్స మొదలెట్టారు.

మా అన్నాయి లా కాలేజీలో ఆ సంవత్సరం ఫైనలు యియరు చదువుచున్నాడు. అన్నాయి ఒకనాడు మా యింటికి వచ్చి నా భర్తతో– "యీ వైద్యమేమిటి? కుముదను కబోదిని చేయకుండా వూరుకోవా యేం? ఎవరినైనా మంచి డాక్టరును పిలిపించరాదా?" అన్నాడు.

"మంచి డాక్టరువచ్చి రోగాన్ని గిల్లివేస్తాడాయేం? ఎవరిచ్చినా అదేమందుగదా!"

అన్నాయికి కొంచెం కోపం వచ్చినట్లుంది. "యింతకూ మీ కాలేజీ ప్రిన్సుపాలుకూ, నీకూ భేదం లేదంటావు?"

"లా స్టూడెంట్సుకు వైద్యమేం తెలుస్తుంది. రేపు నీ పెళ్ళిఅయినాక యెనరైనా నీ భార్యాఅస్తిమీద దావాచేస్తే నా సలహాప్రకారం నడుస్తావా ఏమిటి?"

రాజుల యుద్ధాలు సైనికుల ప్రాణాలకు వెసరు తెచ్చి పెడతవి. వీరిద్దరి కీచులాటమధ్య నేను నలిగిపోతున్నాను. పుట్టింటివారు కన్యాదానం చేసినతర్వాత, నా మంచిచెడులు విషయంలో వారు జోక్యం కలిగించుకోవడందేనికి? నా కష్ట సుఖాలు, ఆరోగ్యానారోగ్య విషయాలభారమంతా నా భర్త దేగదా అని నేను లోలోన అనుకోసాగాను.

ఆనాడు చిన్నవిషయంమీాద వారిద్దరకీ కొంచెము మనస్పర్థలు యేర్పడినవి. అసలే జబ్బువల్ల కళ్ళనుంచి నీరు

కాపుతూవుంది. దానికితోడు వీరిద్దరి మనస్పర్ధలుతోడై కన్నీరు కట్టలు తెంచుకొని పారుతూవుంది. దీనికి కారణం అటు అన్నాయిగాని, యిటు భర్తగాని యెవరూ గ్రహించలేక పోయారు.

ఒకనాడు అన్నాయి నా భర్త యింట్లోలేని సమయము చూసి, హఠాత్తుగా డాక్టరును వెంటబెట్టుకొచ్చాడు. డాక్టరు పరీక్షచేసి- "జాగ్రత్తగా వైద్యం చేయించకుండా, యిప్పటిమాదిరే అశ్రద్ధచేస్తే, చూపుపోయినా ఆశ్చర్యంలేదు. అని చెప్పి మందు చీటి వ్రాసియిచ్చాడు. అన్నాయి మందు తెమ్మని వెంటనే మనిషిని పంపాడు.

డాక్టరు వెళ్ళిపోయినతర్వాత, నేను అన్నాయిని- "నీకు దణ్ణం పెడతాను అన్నాయి. వైద్యం విషయంలో నీ వేమీ జోక్యం చేసుకోవద్దు" అని బ్రతిమాలాను.

చిన్నప్పటినుంచీ నాకు అన్నాయిఅంటే. తగనిభయం! నేను నోరువిప్పి యిలాచెప్పగలగటం నాకే అబ్బురంగావుంది. కాని భర్త కనుమరుగున మరొకమందువాడటం మంచిదికాదని పించింది. అన్నాయికూడా యిలాసాహసించి చెప్పినందుకు, కొంచెం విస్తుపోయినట్టుంది. కొంచెం ఆగి, ఆలోచించి -- "సరే, ఇక డాక్టరును తీసుకురాను; కాని వారు చెప్పినట్టుగా మాత్రము మందు తీసుకుంటూవుండు." అని చెప్పాడు చివరికి.

అన్నాయి యెలా మందువాడవలసిందీ వివరంగా చెప్పి, వెళ్ళిపోయాడు.

భర్త కాలేజీనుంచి రాకముందే, కొత్తడాక్టరు తెప్పించిన మందులన్నీ యింట్లో నూతిలో పారవేశాను.

వారు అన్నాయిమీాది వైమనస్యంతోటే, ద్విగుణీకృత పుత్రాసహంతో వైద్యం చేస్తున్నారు. రెండుపూటలా మందు మారుస్తున్నారు; కళ్ళకు పట్టీలువేశారు; జోడుపెట్టారు. చుక్కలుచుక్కలుగా మందు వేస్తున్నారు; పౌడరు రాస్తు న్నారు; చివరికి చేపనూనెకూడా యిచ్చారు. అది తాగితే, డోకువచ్చినంతపనిజరిగేది. "ఇప్పుడు యెలావుంది"అని అడుగు తుండేవారు. "కొంచెంగుణంకన్పిస్తుంద"ని జవాబుచెప్పేదాన్ని! వ్యాధి కొంచెం తగ్గుముఖంపట్టిందని మనసుకు నచ్చచెప్పుకో టానికికూడా ప్రయత్నించేదానిని! కళ్ళవెంట నీరు యెక్కువగా కారుతుంటే, 'చెడునీరు బయటికి పోవటమే మంచిది' అనిపిం చేది. నీరుకారటం ఆగిపోయిననాడు 'యిక నిమ్మళించినట్టే'నని అనుకునేదాన్ని!

కాని రానురాను కంట్లో పోటు యెక్కువయింది; చూపుకూడా తగ్గుతూవుంది. తలలోనాదుకు, యమచెర అనుభవిస్తున్నాను. నా భర్తకూడా కొంచెం చిన్నపోయి నట్టుంది. యింతకాలానికి డాక్టరును యే సెవంతో పిలవటమో వారికి తెమలకుండా వుంది.

"డాక్టర్ని వొకసారి పిలిస్తే యేంపోయింది? అన్నాయి మాటకూడా నిలిపిన వాళ్ళమవుతాం! అన్నాయికి ఆనాడు కోపంవచ్చింది; అప్పటినుంచీ నా మనసుకు బాధగావుంది. వైద్యం మీరే చేస్తూవుండవచ్చు; అయినా డాక్టరుకి చూపట టం మంచిదనుకుంటాను!"

"అవును, నీవు చెప్పేదేబాగుంది!"

ఆ నాడే యింగ్లీషు డాక్టర్ని తీసుకొచ్చారు; వారిద్దరూ ఇంగ్లీలో యేంమాట్లాడుకున్నారో తెలియదుగాని దొర నా భర్తను గట్టిగా మందలించినట్టు నాకు అర్థమయింది. పాపం వారు ఆ కాసేపు వంచినతల యెత్త లేదు.

డాక్టరు వెళ్ళిపోయినతర్వాత, నేను వారిచేయి పట్టుకుని —"ఈ తెల్లగాడిదను యెక్కడనుంచి పట్టుకొచ్చారు? నాకంటి జబ్బు యీ తెల్లడాక్టరుకు మీకంటే యెక్కువ తెలుస్తుందా? మన దేశపు డాక్టర్ని యెవరినయినా పిలవండి" అన్నాను.

వారు కొంచెం సంకోచిస్తూ — "కంటికి ఆపరేషను చేయాలి!" అన్నారు.

నేను కోపం తెచ్చిపెట్టుకుని — "ఇన్నాళ్ళనుంచి మీరు చెప్పలేదు కాని ఆ మాత్రం మీకు తెలియదా యేమిటి? ఆపరేషనుపేరు వింటే, నేను భయపడతాననుకున్నారా?" అన్నాను.

వారికి సంకోచం తీరిపోయింది. "ఆపరేషను పేరు విని, పురుషుల్లో మాత్రం భయపడనివారు యెంతమందివుంటారు?"

"పురుషుల పరాక్రమమంతా స్త్రీలవద్దనేగదా?" అన్నాను యెగతాళిగా.

వెంటనే వారిమోము కాంతి తరిగి, గంభీరమయింది. చక్కగా చెప్పావు! పురుషుల్లో దర్పంమాత్రం వుంది."

దర్పంలోకూడా మీరు స్త్రీలతో నెగ్గలేరు. అందులోనూ చివరికి మేమే గెలుస్తాము!" అన్నాను, వారి గాంభీర్యాన్ని వూదివేస్తూ.

ఈ మధ్యలో అన్నాయి వచ్చారు. ఆయనతో, యొంటరిగా చూసి, "నీవు తెప్పించిన మందే వాడుతున్నాను; కొంచెం నయమే! కాని వొకనాడు పొరపాటున లోనికి పుచ్చుకునే మందు కంట్లోనూ, కళ్ళమందు, లోనికి వాడటంతో యిలా అయింది. ఆపరేషను చేయాలట' అని చెప్పాను.

నేను యిన్నాళ్ళనుంచీ, నీ భర్తే చికిత్సచేస్తున్నారని కోపంతోటి మీ యింటి చాయలరాలేదు."

"లేదు, లేదు. నేను చాటుగా ఆ మందే తీసుకుంటు న్నాను వారికి యెక్కడ కోపం తెప్పించినదాన్నవుతానోనని. మాటమాత్రం అనలేదు"

ఆడపుటక పుట్టి యెన్ని అబద్ధాలాడవలసి వస్తుందో వాటికి అంతులేదుగదా! అన్నాయి మనసుకూ కష్టముకలి గించకూడదు; భర్తగౌరవానికి భంగంరాకుండానూ చూడాలి! తల్లినైే, పిల్లలనూ బుజ్జగించాలి; భార్యనై, పిల్లలతండ్రినీ సంతోషపెట్టాలి! అబ్బ, స్త్రీలకు నటనతో ఎంతపని కలుగు తుంది!

ఈ నటన ఫలితంగా, కబోదిని కాబోయేముందు బావ మరదులిద్దరూ మనస్ఫూర్తిగా కలిసిపోవటం చూశాను. చాటుగా చేయించిన వైద్యమే దీనికి కారణమనుకున్నారు. అన్నాయి! మొదటే బావమరదిమాట వింటే, రోగం యింత ముదిరిపోయేదికాదనుకున్నారు మా ఆయన! యిద్దరూ యిలా పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, పరస్పరము మన్నించ మని కోరుతున్నట్లు మిక్కిలి సన్నిహితులయారు. నా భర్త,

అన్నాయిని సంప్రతించేవారు; అన్నాయికూడా చాలా విన యంతో నా భర్తమాటమీద చాలానమ్మిక చూపేవాడు.

చివరికి ఒకనాడు యిద్దరి సలహాప్రకారం, ఇంగ్లీషు డాక్టరు నా ఎడమ కంటికి ఆపరేషను చేశాడు. బలిమిలేని కన్ను ఆపరేషనుకు తట్టుకోలేక, వున్నచూపుకాస్తా పోయింది. క్రమంగా కొన్నాళ్ళకి రెండోకన్నుకూడా చీకట్లు కమ్మినవి. పెళ్ళినాడు లగ్నసమయాన మొట్టమొదటగా నేను చూచిన చందన చర్చిత తరుణమూర్తి ని కన్నార దర్శించే భాగ్యం లేకుండాపోయింది.

వారు ఒకనాడు నా మంచంవద్ద కూచుని – "ఇక నీ వద్ద గొప్పలు చెప్పుకోను– నీ కళ్ళు రెండూ చేతులారా పోగొట్టాను" అన్నారు.

ఆ మాట చెపుతుంటే వారికిదుఃఖం పొర్లుకొస్తూవుంది. నేను రెండు చేతుల్లోకి వారి కుడిచేతిని తీసుకుని నొక్కుతూ "మీ వస్తువు మీరే తీసుకుని మంచిపని చేశారు! మరొక డాక్టరు చేతిమీదుగా నా కళ్ళుపోతే, నాకు మనశ్శాంతి యేముంటుంది? విధివ్రాతను ఎవరు తప్పించగలరూ? ఎవరూ నయం చేయలేనప్పుడు మీ చేతుల్లో నా చూపు పోవటమే అన్నిటికంటె నాకు పెద్ద వూరటగా వుంది. పూజాపుష్పాలు తరిగిపోయినప్పుడు, స్వయంగా శ్రీరామచంద్రుడంతటివాడు తన నేత్రాలు రెండూ వూడబెరికి యిష్టదేవతకు అర్పించ టానికి సిద్ధపడ్డాడు. నేనూ నా దేవునికి దృష్టిని సమర్పించాను. దీనిని మించిన అదృష్టం యింకా యేముంది? మీ కంటికి ఇంపైనదేదో కొంచెం నా చెవినికూడా వేయండి; అదే మహా

ప్రసాదంగా యెంచి మనసులో భద్రపరచుకుంటా"నని అను కున్నాను.

ఈ మాటలన్నీ ముఖతా చెప్పటంమాత్రము యెలా సాధ్యం? కానీ యిదే చాలా రోజులు ఆలోచిస్తూవుండే దానిని. మధ్యమధ్య నా దీక్షకూడా సన్నగిలుతూవుండేది. నేను కష్టాలకు దురదృష్టానికి గురి అయానని తలపోసినప్పుడు యీ విషయాలు నా మనసుకు బోధించేదానిని. నేను యిలా శాంతి భక్తితోడ్పాటుతో కష్టాలకు అతీతంగా వుండటానికి ప్రయత్నించేదానిని. అప్పుడు మాటలమధ్యలోనూ, ముఖా వంతోనూ నా మనసులోని ఉద్దేశాల్ని యేదో కొంతవరకు వారికి తెలియపరచగలిగాను.

"కుమూ నా మూర్ఖత్వంవల్ల నీకు తీరని నష్టం వాటి ల్లింది; అది నేను యెలానూ పూర్తి చేయలేను. కాని నా శక్తికొద్దీ నీ దృష్టిలోపం తీర్చటానికి సర్వదా నీకు చేదోడు వాదోడుగా వుంటాను."

"అలా చెప్పటం వుచితంకాదు! మీ కుటుంబాన్ని గుడ్డివాళ్ళ ఆస్పత్రిగా తయారుచేయటానికి నేను యెప్పటికీ అంగీకరించలేను. మీరు మళ్ళీ పెళ్ళిచేసుకోవలసిందే!"

మళ్ళీ పెళ్ళిచేసుకోవలసిన ఆవశ్యకతను వివరించబోయే సరికి, నాకంఠం అవరుద్ధమయింది. కొంచెందగ్గి, గొంతుసవరిం చుకుని యేదో చెప్పాలనుకున్నాను. కాని యింతలో నాభర్త వల్లమాలిన ఆవేశంతో - "నేను మూర్ఖుణ్ణికాని డాంబికుణ్ణి మాత్రం కాదు. చేతులార నిన్ను కబోదినిచేశాను. ఆమీదట నిన్నువిడిచి, మళ్ళీపెళ్ళిచేసుకొని, బ్రహ్మహత్యా, పితృహత్యా

సదృశపాపానికి వొడిగట్టలేను. ఇది నేను కులదేవత గోపీనాథు సాక్షిగా చెప్పుతున్న మాట !" అని శపథంచేశారు.

వారిని యిలా శపథంచేయకుండా మధ్యలోనే ఆపవలసి నదికాని అప్పుడు నా హృదయాన్ని చీల్చుకుని, గొంతునొక్కి వేసి కన్నీరు పొర్లుకొస్తూవుంది ; నేను కన్నీటిని దిగమింగే ప్రయత్నంలో వున్నాను ; నోట మాట రాలేదు. వారి శపథం విని, పరమానందంతో, సుఖోద్వేగంతో దిండులో ముఖం పెట్టుకుని యేడవసాగాను. నేను కబోదిని అయినా, వారు నన్ను త్యజించరు; హృదయంలో దుఃఖంమాదిరి భద్రపరచు కుంటారు ! ఇంత అదృష్టం నేను కోరను - కాని మనసు స్వార్థానికి పెట్టింది పేరు !

నేను కంటికి కడివెడుగా యేడ్చి వారిమోమును నా హృదయానికి హత్తుకుని - "ఇంత కఠోరశపథంచేశారు దేనికి? రామరామ ! నేను నా సుఖంకోసం మళ్ళీ పెళ్ళిచేసుకోమని యెందుకు చెప్పినట్టు? దృష్టిలోపంవల్ల మీకు నేను చేయలేని పనులన్నీ సవతిచేత చేయించుదా మనుకున్నాను !" అని చెప్పాను.

"దాసీదికూడా నా పనులు చేసిపెడుతుంది. అంత మాత్రాన దాసీనిపెళ్ళాడి, నా దేవతసరసన కూర్చోబెట్టనా" అంటూ వారు నా మోముపైకెత్తి, లలాటం ముద్దిడుకున్నారు. ఆ చుంబనమే నా మూడోకంటిని తెరచి, మరుక్షణమే నన్ను దేవతగా అభిషేకముచేసినట్టుంది. "ఇదే మంచిది ; రెండు కళ్ళూపోయినాక, యీ సంసారలంపటంతో నా కేంపని? నేను వీటికి అతీతంగా, భర్తకు మేలు చేకూరుస్తాను. ఇల్లాలికి అవ

సరమైన క్షుద్రవిషయాలతో – అబద్ధాలు, నటన – పనిలేకుండా మనసా వాచా పవిత్రురాలిని అవుతాను' అని లోలోపల తలచాను.

ఆనాడంతా నాలో అంతర్యుద్ధం చెలరేగింది. కఠోర శపథానికి కట్టుబడి, నా భర్త రెండో వివాహం చేసుకోలేడనే ఆనందం లోపల నా హృదయాన్ని చీరుతున్నట్టుగా వుంది. దానినుంచి యెంతప్రయత్నించినా విముక్తి లభించలేదు. ఇవాళ నాలో నూతనంగా వెలిసిన దేవత 'ప్రతిజ్ఞాపాలనకంటె వివాహమే నీ భర్తకు శుభప్రదమయేరోజుకూడా రావచ్చును' అన్నది. కాని నాలోని పురాతనగృహిణి యిందుకు సమాధానముగా – 'అయితే యే, ప్రతిజ్ఞ చేసినతర్వాత వివాహంచేసుకో లేరు' అని చెప్పింది, 'కాని యిందులో నీవు సంతోషించవలసిన దేమీలేదే!'' అని యెదురుప్రశ్న! 'నా కన్నీ తెలుసు, మిగతాప్రతిజ్ఞ చేశారుగదా —' అని నా లోని నారీమణి జవాబు! ఇక దేవత మాటపలుకలేదు; మౌనం వహించింది. కనుబొమలు ముడిపీడినై. యేదో రానున్న ఘోరవిపత్తును సూచిస్తున్నట్టు నా హృదయము అంధకారావృతమయింది.

నా భర్త దాసదాసీలను కాదని, స్వయంగా నాకు పరిచర్య చేయసాగారు. ప్రతి చిన్నపనికీ భర్తమీద ఆధారపడటం ముచ్చటగానే వుంది. కారణం ఆ నెపంతోనయినా వారు ముప్పొద్దులా నా వద్దవుంటారు. వారిని కంటితో చూసేప్రాప్తి లేకుండాపోయింది; అందువల్ల వారు యెప్పుడూ నా వద్దవుంటే బాగుండుననే కోరిక ప్రబలమయింది. భర్త మోమును తిలకించే నా నేత్రాలవాటాను మిగతా యింద్రి

యాలు పంచుకోటానికి ప్రయత్నం చేయసాగినవి. వారు యేదైనాపనిమీద బయటికి వెళ్ళిరావటం ఆలస్యమయితే నా సర్వస్వం పోగొట్టుకున్నట్టూ, శూన్యంలో తారట్లాడుతున్నట్టూ ఉండేది. ఇదివరకు వారు కాలేజీనుంచి పెందలకడ రాకపోతే, రోడ్డుతల కిటికీతలుపు కొద్దిగా తెరచి, వారికోసం నిరీక్షించేదానిని. వారి బాహ్యప్రపంచాన్ని నా నేత్రాలతో బంధించివుంచాను. కాని యివాళ కంటిచూపు లేని సమస్త శరీరము వారిని ఆన్వేషిస్తూవుంది. మా యిద్దరి ప్రపంచాల మధ్య కట్టిన వంతెన యివాళ కూలిపోయింది. ఇప్పుడు మా యిరువురి మధ్య చీకటి అఘాతం యేర్పడింది; వారు ఆ దరి నుంచి యీ దరికి యెప్పటికివచ్చి నన్ను కలుసుకుంటారా అని వివశురాలినై, ఆదుర్దాగా కాచుకు కూర్చుంటాను. వారు క్షణకాలం నన్ను విడిచివెళ్ళినా, యీ కబోదిశరీరము వారిని బంధింపజూస్తుంది; హాహాకారాలతో పిలుస్తూంది.

కాని యింత ఆవేశం, అసక్తి యెప్పటికీ మంచిదికాదు. సాధారణంగా భార్య బరువు భారాలన్నీ భర్తమీదే వుంటవి; దానికితోడు యీ అంధత్వభారంకూడా వారిమీద మోపటం న్యాయంకాదు. ఈ విశ్వవ్యాప్తి అంధకారాన్ని వొంటరిగానే భరిస్తాను. ఈ అనంత అంధత్వ పాశంతో నాభర్తను ఒక్క నాటికీ బంధించివుంచనని లోలోపల దృఢప్రతిజ్ఞచేసుకున్నాను.

నేను కొద్దిరోజుల్లోనే శబ్ద, గంధ, స్పర్శతో నాపను లన్నీచేసుకోవటం అలవర్చుకున్నాను; యింటిపనులుకూడా వెనుకటి కంటె చక్కగా చేయసాగాను. 'మనదృష్టి మన పనులకు యెంత సాయపడుతుందో, అంతకుమించి మనలను

విభ్రాంతుల్ని చేస్తుంది. యెంతవరకు చూడటం శుభదాయకమో, నేత్రాలు దానిని మీరి చూస్తుంటవి. నేత్రాలు, కావలా కాస్తుంటే చెవులకు సోమరితనం అలవడుతుంది. అప్పుడు చెవులు వినవలసిన దానికంటె తక్కువ వింటవి' అని తోస్తూవుంది. యిప్పుడు చంచల నేత్రాల లోటువల్ల మిగతా యింద్రియాలు తమ కర్తవ్యాన్ని చక్కగా పాటిస్తున్నవి.

వారిని నావనులేమీ అంటుకోనివ్వటంలేదు. నేనే పూర్వంమాదిరి వారి పనులన్నీ చూస్తున్నాను.

వారు వొకనాడు — "నన్ను ప్రాయశ్చిత్తమయినా చేసుకోనివ్వవా?" అన్నారు నాతో.

"ఆ ప్రాయశ్చిత్తమేమిటో నాకు తెలియదు. కాని యింకా నన్ను పాపభారం పెంచుకోమంటారా?"

వారు పైకి యేమి చెప్పినా, నేను పూర్తిస్వేచ్ఛ నివ్వగానే వారికి చెరనుంచి బయవడినట్టుంది.

తర్వాత డాక్టరు పరీక్ష పూర్తిచేసి, నన్ను వెంటబెట్టుకుని వారు స్వగ్రామానికి వచ్చారు. ఇక్కడ నాకు తల్లి వొడిలోకి చేరినట్టుగావుంది. ఎనిమిదేళ్ళప్రాయంలో వూరు విడిచి కలకత్తావచ్చాను. ఈ పదేళ్ళలో జన్మభూమి నా మనసులో నీడమాదిరి అస్పష్టమయింది. చూపు వున్నంతవరకూ కలకత్తాపట్టణం నలువైపులా నా సమస్త స్మృతులనూ తన మరుగున కప్పివుంచింది. చూపుపోగానే, కలకత్తా కళ్ళను మిరుమిట్లుగొల్పే పట్టణమని అర్థమయింది; చిన్ననాటి పల్లెటూరు, చీకటిరాత్రి ప్రకాశించు నక్షత్రంమాదిరి నా మనసులో వుద్భాసితమయింది.

ఆశ్వయుజమాసం వెళ్ళుతుందనగా, మేము హాసిప్‌పూరు చేరాము. అంతా కొత్తగావుంది. ఆ పల్లెటూరి దృశ్యాలను చూడలేకపోయాను; కాని బాహ్యానుభూతులు నన్ను ముంచెత్తినవి. మంచుకుతడిసి, దున్నివిడిచిన చేలమీదుగా వచ్చే వుదయపుగాలులూ, పంటకువచ్చిన కంది, ఆవచేలనుంచి వచ్చే ఆకాశవ్యాప్తమయిన సువాసనలు, గొడ్లకాపరుల పల్లెపదాలు, వాకటేమిటి, చివరికి వంకరటింకర మట్టిరోడ్లమీద పోయే యెడ్లబండి సవ్వడికూడా నన్ను ముగ్ధురాలినిచేసింది. చిన్నతనపు అతీతస్మృతులు అనిర్వచనీయమైన ఆనందంతో, నెత్తావులతో ప్రత్యక్షవర్తమానంమాదిరి నన్ను ఆకట్టినవి. నా శూన్యనేత్రాలు కిమ్మనలేదు. నేను మళ్ళీ బాల్యావస్థను పొందాను. నాకు కన్నతల్లేకాదు, సమస్తమూ లభించినట్టుంది. మా నాయనమ్మ వీపు యెండవైపుకుపెట్టి, వూడిపోగా మిగిలిన వెంట్రుకలు విరియబోసుకుని, కూర్చుని అప్పడాలుచేస్తూవుంది. కాని కంపించే ఆమెకంఠంనుంచి దేహతత్వానికి సంబంధించిన భజనదాసుపదాలు యివాళ వినిపించటంలేదు. శీతాకాలపు, మంచులో స్నానమాడిన ఆకాశపథంలో 'నవాన్న' వుత్సవం మూర్తీభవించినట్టుంది; కాని కొత్త ధాన్యందంచే పల్లెస్త్రీలలో నా చిన్ని చెలికత్తెలు యెవరూ గోచరించటంలేదు! కనుచీకటి పడగానే 'అంబారవం'విని, మా అమ్మ దీపంచేతపట్టుకుని గొడ్లచావడిలోనికి వెళ్ళటం తలపుకు వచ్చింది. మండుకునానిన చెత్తకాలిన వాసన పొగ నా మనస్సులో మెదిలినవి. చెరువు అవతల విద్యాలంకారుల దేవాలయంనుంచి విన్పించే ఘంటారవంకూడా గుర్తుకొచ్చింది. ఎవరో నా బాల్యకాలపు ఎనిమిది

సంవత్సరాల సారాంశాన్ని వడకాచి, రసపరిమళాలను నా చుట్టూ విరజిమ్మినట్లుంది.

చిన్ననాటి నోములూ, చీకటితో లేచి శివ పూజకు పూలు కోసుకురావటమూ, అన్నీ వొకటే తలపుకు వస్తున్నవి. కలకత్తా వాతావరణం మనబుద్ధిమీద కొద్దోగొప్పో మార్పు చూపుతుందని అంగీకరించక తప్పదు! పూజాపునస్కారాలు, భక్తిశ్రద్ధలవిషయంలో గ్రామాల్లోమాదిరి సారళ్యం కలికానికయినా కానరావు.

అంధురాలిని అయినాక మావూరు నుంచి వొక స్నేహితురాలు నన్ను చూడటానికి వచ్చింది. "కుముూ, నీకు కోపంగాలేదూ! నేనైతే యెప్పటికీ భర్తముఖం చూచేదాన్నికాదు" అంది.

"అక్కా ముఖంచూసే గీత యెలానూలేదు; అందుకు యీ పాడుకళ్ళను అనుకోవాలిగాని వారిమీద కోపం దేనికి?"

సకాలంలో మంచిడాక్టరుచేత చికిత్స చేయించనందుకు నా స్నేహితురాలు మావారిమీద మండిపడి, నాకుకూడా కోపంకలిగించటానికి ప్రయత్నించింది.

"జీవితంలో తెలిసిగాని, తెలియకగాని, యిష్టమున్నా లేకపోయినా అనేకవిధాల కష్టసుఖాలు ప్రాప్తిస్తూవుంటవి. కాని మనసులో నా భర్తను చక్కగా ప్రతిష్టించుకో గలిగితే, కష్టాలలోకూడా ఒకవిధమైన శాంతి లభిస్తుంది. లేకపోతే కోపతాపాలతో కీచులాటతో జీవితంకాస్తా వెళ్ళబారిపోతుంది. అంధురాలిని కావటమే వొకతీరనిదుఃఖం; దానికితోడు భర్తతో విరోధం పెట్టుకుని దుఃఖభారం పెంపుచేసుకోవటం దేనికి" అని,

లావణ్యకు నచ్చజెప్ప ప్రయత్నించాను. కాని ఆమె నానోట మాంధాత కాలంనాటి మాటలువిని కోపగించుకుని తృణీకారంగా తలవూపి, విసురుగా వెళ్ళిపోయింది.

కాని పైకి యేమి చెప్పినా, లావణ్యమాటలు నామీద పనిచేయకపోలేదు. ఆమె క్రోధాగ్ని నామనస్సుమీద నిప్పురవ్వలు విసిరింది నేను వాటిని కాలరాచి ఆర్పివేశాను కాని వొకటి రెండు చోట్ల బొబ్బలెక్కినవి

స్వగ్రామంలో పూజాపుష్పాల కమ్మని వాసనలకు బాల్యంలో మాదిరే, నా హృదయంలోని వాంఛలు, శ్రద్ధాసక్తులు చిగిర్చి నూతనరూపాన్ని దాల్చినట్టుంది. నా ఆరాధ్య దైవం నా హృదయానికి కాపరానికి నిండుదనం ప్రసాదించాడు. నేను వారి పాదాలమీద వాలి - "కబోదిని అయితే అయాను కాని మీరుమాత్రం నాకు లభించారు!" అన్నాను.

అయ్యో, నోరు జారాను పొరపాటున! మీకు 'నా వాళ్ళే' అని చెప్పటంలో దర్పంవుంది. నేను మీ దానిని' అని చెప్పటానికి మాత్రం నాకు అధికారంవుంది. ముందుముందు నా దైవమే అస్పష్టంగా యీ మాట నానోటితో చెప్పించవచ్చు! అప్పటికి యేమి శేషించకపోయినా, నేను వుండక తప్పదు. వొకరిమీద నాకేవిధమైన అధికారమూ లేదు - నామీదతప్ప!

కొంతకాలం ఆనందంగా గడిచిపోయింది. వైద్యంలో వారు పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నారు; కొంతడబ్బుకూడా కూడబెట్టారు. కాని ధనము మంచిదికాదు. అది మనసును అణచివేస్తుంది. హృదయాన్ని మరుగుపరుస్తుంది. మనసు పెత్తనం

చేసినంతకాలమూ తన శుభాన్ని తానే అన్వేషించుకుంటుంది. కాని ధనం సుఖాన్వేషణకు పూనుకున్నప్పుడు, మనసుకు పనేమీ వుండదు. ఇకను మానసిక సుఖస్థానాన్ని గృహోప కరణాలు ఆక్రమించుకుటవి. అప్పుడు మనకు శుభానికి మారుగా వస్తువాహనాదులు లభిస్తవి.

నేను ఫలానా సంఘటనను పురస్కరించుకొని యీ నిర్ణయానికి వచ్చానని చెప్పలేను. కాని అంధులకు అనుభూతి యెక్కువ కావడంవల్ల కానీ, మరేకారణంవల్ల కానీ ఆర్థికస్థితి చక్కబడుతున్నకొద్దీ మా వారిలో మార్పు రాసాగింది. యువ్వనారంభంలో మాదిరి న్యాయాన్యాయాల విషయంలో వారిలోని సానుభూతి విచక్షణ నానాటికి సన్నగిల్లుతున్నట్టుంది. వారు మాటల సందర్భంలో అన్నట్టు యిప్పటికీ గుర్తుంది. 'నేను జీవనంకోసమే డాక్టరుపరీక్ష చదవడం లేదు;- దీనితో బీదసాదలకు కూడా మేలు చేయవచ్చు' చేతిలో డబ్బు రాలనిదే, బీదరోగులచేయిచూడని డాక్టర్ల పేరువింటే వారికి చీమలు పాకినట్టుండేది.

పూర్వపురోజులు మళ్ళీరావని అర్థమయింది. యెఃరో దరిద్రురాలు తన ఏకైకపుత్రుణ్ణి కాపాడమని వలవలఏడ్చింది. కాని వారు ఆవిడప్రార్థనను మన్నించలేదు. చివరకి నేను వొట్టు పెట్టి వారిని పంపాను కాని శ్రద్ధగా మందివ్వలేదు-మాకు డబ్బు తక్కువగావున్న రోజుల్లో వారు అన్యాయంగా సంపాదించిన ధనాన్ని యెంతహీనంగా చూసేదీ నాకు తెలుసు. కాని యిప్పుడు బ్యాంకులో డబ్బు పోగుపడింది. షావుకారు గుమాస్తావొకడు వరసగా రెండురోజులు వచ్చి వారితో

యేమిటో గుసగుసలు చేశారు. నాకు వివరాలు తెలియవు. కాని మూడోనాడు భర్త నా దగ్గర పరమానందంతో లోకాభిరామాయణం మొదలెట్టారు. వారు యివాళ యేదో మాయని అప్రతిష్టపాలు అయారని నా అంతఃకరణ స్పర్శ శక్తితో వెంటనే గ్రహించాను.

కళోదిని కాబోయేముందు చివరిసారిగా చూచిన నా హృదయాధినాథుడు యివాళ యేమయారు? నా లలాటాన్ని ముద్దిడుకుని నన్నొక దేవతగా అభిషేకించిన వారికి నేను యేం ఉపకరించగలిగాను? హఠాత్తుగా వొకనాడు అరిషడ్వర్గాల ఝంఝూమారుతానికి గురిఅయిన వ్యక్తి మరొకనాటి హృదయావేశంతో వుద్ధరింపబడవచ్చు. కాని రానురాను క్షణక్షణమూ దయాదాక్షిణ్య రహితులవుతూ ప్రాపంచిక విషయాల్లో క్రమంగా హృదయాన్ని మనస్సును అణిచివేస్తూ పోతున్నారు. దీనికి ప్రతిక్రియ యెంత ఆలోచించినా పాలు బోలేదు.

భర్తతో సంభవించిన యీ దృష్టివియోగము అంతగా లెక్కించదగినది కాదు కాని లోతుకుదిగి, తాపీగా ఆలోచించిన కొద్దీ, నేను వున్నతావున వారు లేరని బోధపడుతూవుంది. నేను అంధురాలిని. ప్రపంచపు వెలుగుచొరని హృదయప్రదేశములో, నా నూతనప్రేమను, అచంచల భక్తివిశ్వాసాలను భద్రపరచుకున్నాను; నా దేవాలయంలో చిట్టిచేతులతో నేను సమర్పించిన పూజాపుష్పాల మీది మంచుతడి ఆరకమునుపే, నా భర్త, చల్లనినీడలనిచ్చే యీ నిత్యనూతన దేశం విడిచిపెట్టి, సంపాదన ఆశనుపడి, యీ ప్రపంచయెడారిలో అదృశ్యులై

పోతున్నారు. నేను యెవరిని నమ్మానో, యెవరిని ధర్మదేతవగా యెంచానో, యెవరిని సుఖసంపదలకంటె మిన్నగా భావించానో, వారు చాలా దూరంనుంచి నా వంకచూసి ముసిముసినవ్వులు నవ్వుతున్నారు. కాని మా యిరువురికి విచ్ఛేదమెరుగనిరోజులు కూడా లేకపోలేదు. బాల్యంలో మేమిద్దరమూ వొకేబాటను పయనించాము. తర్వాత మా బాట యెప్పటినుంచి చీలిపోయిందో యెవరికీ తెలియలేదు. చివరికి యివాళ నేను యెంత పిలిచినా, జవాబే రావటంలేదు.

కబోదిని కావటంవల్ల ప్రతివిషయాన్ని గోరంతలు కొండంతలుచేసి చూస్తున్నాను; కళ్ళుంటే, నేనూ ప్రపంచాన్ని సరిగ్గా ప్రపంచంమాదిరే చూసి, గుర్తించగలిగేదాన్ని అని అప్పుడప్పుడు తలపోస్తుండేదానిని!

మా వారుకూడా వొకసారి యిదేమాట అన్నారు. ఆ నాటివుదయం వొకవృద్ధరైతు, కలరాతగిలిన మనుమరాలిని బ్రతికించుకుందామని గంపెడాశతో డాక్టరుగారిని తీసుకెళ్ళటానికి వచ్చాడు. "బాబూ, నేను కటికబీదను; భగవంతుడు మీకు మేలుచేస్తాడు" అని ఆ రైతుచెప్పేమాటలు నా చెవిని పడినై. "భగవంతుడు చేసేదానితో మాపని జరగదు. ముందు నీ వేమి చేస్తావో చెప్పు" అంటున్నాడు నా ఆరాధ్యదేవత! ఆ పరమాత్ముడు నేత్రాలతోపాటు యీ పాపిష్ఠి చెవులు యెందుకు తీసుకుపోలే దనుకున్నాను! ఆ వృద్ధుడు దీర్ఘంగా నిట్టూర్చి, 'ఆరి దేవుడా' అనుకుంటూ వచ్చినదారిన వెళ్ళిపోయాడు. నేను అతన్ని దొడ్డివాకిలిదగ్గరికి దాసీచేత పిలిపించి – "తాతా,

యీ డబ్బు తీసుకెళ్ళి, మనుమరాలికి మరో డాక్టరుచేత మందు యిప్పించి, నా భర్తను ఆశీర్వదించ"మని చెప్పాను.

ఆ రోజంతా నాకేమీ తోచలేదు; అన్నం సహించ లేదు. వారు సాయంకాలం నిద్రలేచివచ్చి — "ఇవాళ నీవు యేదో దిగులుగా వున్నావేమిటి?" అని అడిగారు - పూర్వం మాదిరి అలవాటు పడిన జవాబు 'లేదు, లేదు' అని నాలుక మీదికివచ్చింది కాని ఆ నటనాయుగం గతించింది. నేను కుండ బద్దలుకొట్టినట్టు — "చాలారోజులనుంచి మీతో చెప్పాలను కుంటున్నాను; కాని సమయానికి చెప్పవలసిందికాస్తా మరిచి పోతున్నాను. నా మనసులోనివుద్దేశం మీకు విడమర్చి చెప్ప గలనో లేదో తెలియదు కాని మీరు యేమాత్రం ప్రయత్నిం చినా, తేలికగా అర్థంచేసుకోగలరు - మనిద్దరమూ యేకమై ప్రారంభించిన జీవితం, నేడు మరోవిధంగా మారిపోతూవుంది" అని చెప్పాను.

వారు మందహాసంచేసి - "పరివర్తనమే ప్రపంచధర్మం!"

"భోగభాగ్యాలు, అందచందాలు అన్నీ పరివర్తనం చెందేమాట నిజమే కాని ప్రపంచంలో శాశ్వతమైనది యేమీ లేదా?"

అప్పుడు వారు కొంచెం గంభీరంగా- "చూడు, చాలా మంది స్త్రీలు వాస్తవంగా, వారికి లేనిదానికోసం విలపిస్తారు - కొందరి భర్తలు సంపాదించటంలేదని, మరికొందరి భర్తలు ప్రేమించటంలేదని - ఇక నీవేమో, లేనిదుఃఖాన్ని అన్వేషిస్తుం టావు!" అని చెప్పారు.

అంధత్వాము నా కండ్లకు సత్యాంజనము రాచి, నన్ను యీ మారిపోయే ప్రపంచానికి యెడంగా తీసుకువెళ్ళింది; నేను యిక అన్యస్త్రీలవంటి దానిని కాను, నా భర్త నన్ను అర్థం చేసుకోలేరని వెంటనే గ్రహించాను.

ఒకనాడు వారి మేనత్త మా వారిని పలకరించి పోదామని వచ్చింది. మేమిద్దరమూ ఆమెకు నమస్కరించాము. ఆమె మమ్ములను ఆశీర్వదించేముందే – "అమ్మాయి, నీ అదృష్టం బాగుండక, నీవు గుడ్డివి అయావు – యిక మా అవినాశుడు గుడ్డిభార్యని పెట్టుకుని సంసారం యెలా యీడుస్తాడు? వాడికి పెళ్ళి చేయరాదా?" అని మొదలెట్టింది. అందుకు నా భర్తనవ్వుతూ – "అలానే అత్తా, మీరిద్దరూ యెక్కడైనా మంచి సంబంధంవొకటి చూడరాదూ!" అంటే, యేచిక్కూ లేకపోను! కాని వారు సంకోచిస్తూ "నీ వెప్పుడూ యింతే, తలాతోకలేకుండా మాట్లాడతావు?"అన్నారు.

"యేం, ఇందులో కాని మాటేముంది? నీవే చెప్పు అమ్మాయి?"

నేను నవ్వుతూ–"పెద్దమ్మా, మీరు మంచివారిని సలహా అడిగారు! మాటా ముల్లె కత్తిరించేవాళ్ళు యెక్కడైనా ముందుగా సలహా తీసుకుని చేస్తారా?" అన్నాను.

"అవునవును, ఆ మాట నిజమే. అయితే మనమిద్దరం వొంటరిగా మాట్లాడుదాం! ముందు నామాట వొకటిఆలకించు తల్లీ, కులీనకుటుంబంలో సవతుల సంఖ్య పెరిగినకొద్దీ, భర్త గౌరవం పెంపొందుతుంది. మావాడు డాక్టరు కాకుండా, పెళ్ళిళ్ళు చేసుకుంటూవున్నా, భోగభాగ్యాలకు కొరత వుండేది

కాదు. వొకొకసారి డాక్టరు, చేయి చూస్తుండగానే, రోగి ప్రాణాలు పోతవి; చనిపోయినాక చిల్లిగవ్వకూడా ఫీజు ఇవ్వరు. కాని బ్రహ్మదేవుడు శాపంపెట్టాడుగా – కులీనుని భార్యకు మరణమే రాదు; ఆవిడ యెంతకాలం జీవిస్తుందో అంతకాలమూ భర్తకు అన్నివిధాల లాభమే!"

రెండురోజులు జరిగినాక, వారు నా సమక్షంలోనే –"అత్తా, మంచికుటుంబాల పిల్లలు మనలో కలసిమెలసి యిక్కడే వుండిపోయేవాళ్ళెవరయినా నీ ఎరుకలో వున్నారా? యీవిడికి కంటిచూపు పోయింది; యీవిడని యెవ్వరూ కనిపెట్టుకొని, తోడుగావుండేపిల్ల దొరికితే, నాకు యే చీకూ చింత వుండదు" అని చెప్పారు మేనత్తతో.

నేను కబోదినిఅయిన కొత్తలో యీ మాట అంటే అర్థంచేసుకోగలను. ఇవాళ చూపు పోయినా, యింటి పని పాటల్లో చెప్పదగ్గయిబ్బంది కలుగుతున్నదా అంటే అదేమీ లేదు. అయినా కిమ్మనకుండా ముభావంగా కూచున్నాను. "పిల్లలకేం, కోకొల్లలు! ఎక్కడిదాకా దేనికి, మా బావగారి అమ్మాయివుంది, అందానికి అందంవుంది; గుణవంతురాలు కూడా! యెదిగినపిల్ల! తగినసంబంధం తటస్థపడక తిరుగుతున్నారు. నీవు తల ఎగరవేస్తేచాలు, కళ్ళకద్దుకుని యిస్తారు!" అని నూరిపోయసాగింది. వారు కొంచెం త్రుళ్ళిపడి "యిప్పుడు పెళ్ళిమాట యేంవచ్చింది" అన్నారు.

"వినమ్మా. విను. మంచికుటుంబంలోని పిల్లలెవరైనా పెళ్ళికాకుండా, మీ యింట్లో పడివుంటానికి సమ్మతిస్తారా?"

ఆమాట యదార్థమే! నాభర్త దానికేమీ జవాబివ్వ లేదు.

నేను నిమీలిత నేత్రాల అంతరాంధకారంలో వొంటరిగా నిలబడి, మోము పైకెత్తి - "పరమాత్మా! నా భర్తను రక్షించ" మని ప్రార్థించాను.

కొన్నాళ్ళు జరిగినాక, నేను పూజాగృహంనుంచి వస్తూ వుంటే, వారిమేనత్త వచ్చి - "అమ్మా మా బావగారి అమ్మాయి హేమాంగిని సంగతి చెప్పానే, ఆ పిల్ల యిప్పుడే వచ్చింది - హేమా, నీకు అక్కాయి అవుతుంది. నమస్కరించు" అని చెప్పింది.

ఇంతలోకి వారుకూడా యెటునుంచోవచ్చి, అపరిచితురాలిని చూస్తున్నట్టు అక్కడనుండి వెళ్ళిపోవటానికి సిద్ధమయ్యారు.

"ఎక్కడికిరా వెళ్ళుతున్నావు?" అంది మేనత్త.

"యీపిల్ల యెవరు?" అని అడిగారు నా భర్త.

"యీ పిల్లే మా బావగారిఅమ్మాయి హేమాంగిని!"

"యెపుడు వచ్చింది, యెలా వచ్చింది, యెవరు తీసుకొచ్చారు" అని వారు ప్రశ్నలవర్షం కురిపిస్తూ లేనిపోని ఆశ్చర్యము వెలిబుచ్చసాగారు. నే నప్పు డనుకున్నాను మనసులో! 'జరిగేతంతు యావత్తు నాకు తెలుస్తూనేవుంది. పైగా యీ అబద్ధాలు, యీ నాటకము అంతా యెందుకు? అశాంత ప్రవృత్తికోసం అధర్మానికి తలపడినప్పుడు వెరవటం దేనికి? నా వద్ద యింత హైన్యమా,! మోసమా! నన్ను మభ్యపెట్టటానికి యింత బూటకమా!'

నేను హేమాంగిని చేయి పట్టుకుని పడకగదిలోకి తీసుకెళ్ళి, ఆ పిల్ల మోము, చెక్కిళ్ళు చేతితో తడివి చూశాను; మోము అందమైనదని చెప్ప వచ్చు వయసుకూడా 15, ఆ ప్రాంతాల వుంటుంది.

ఆ పిల్లపక్కుననవ్వి—"అక్కా, యిదేమిటి? నా వొంటి మీంది భూతాన్ని వదులుస్తున్నావా?"అంది.

ఆ పిల్ల నిర్మలహాస్యానికి మా యిద్దరిమధ్యవున్న కారు మబ్బు విడిపోయింది. నేను ఆమె మెడలో కుడిచేయి వేసి — "నిన్ను చూస్తూన్నాను చెల్లీ!" అని మోమును చేతితో మరొకసారి నిమిరాను.

"చూస్తున్నావా!" అని, ఆ పిల్ల నవ్వుతూ — "మీ తోటలో కాసిన కాయగూరలనుకున్నావా చేతితో పట్టుకు చూడటానికి!" అంది.

హేమకు నేను అంధురాలినని యింకా తెలియదని వెంటనే స్ఫురణకు వచ్చింది.

"నేను కబోదిని చెల్లీ!"

ఆ మాట వినగానే హేమ ఆశ్చర్యపోయి కాసేపు గంభీరంగా వుంది. ఆమె కుతూహల పూరితమైన విశాలనేత్రా లతో దృష్టివిహీనమైన నానేత్రాల భావాన్ని, ముఖవైఖరిని తీవ్రంగా పరిశీలించిందని నాకు చక్కగా బోధపడింది. తర్వాత "అలానా! అందుకే నన్నమాట పిన్నిని పిలిచింది!" అని అంది.

లేదు, నేను పిలవనంపలేదు —— మీ పిన్నే వచ్చింది."

హేమ మళ్ళీ నవ్వుతూ — "దయచేసి కావాలి! అయితే ఆ దయామయీ, తొందరగా యిక్కడనుంచి కదిలే

ఘటంకాదు! మరి నాన్నగారు నన్నెందుకు పంపినట్టు? అని అడిగింది.

ఇంతలోకివాళ్లపిన్నివచ్చింది. ఆమె యింతసేపూ వారితో మంతనాలు చేస్తూంది ఆమె గదిలో అడుగుపెట్టగానే హేమ – "పిన్నీ, మనం యింటికి యెప్పుడు వెళ్తాము?" అనిఅడిగింది.

"అమ్మపిల్లా! వచ్చీరాకముందే వెళ్ళిపోదామని పట్టుకు కూచున్నావే! యింత కాలు కుదురునిపిల్లని నే నెక్కడా చూడ లేదమ్మా!"

"నీ ధోరణిచూస్తుంటే, యిక్కడినుంచి కదిలేటట్టులేవు. సరే, ఇది నీకు సొంతయిల్లులాంటిది; యిష్ట మొచ్చినంతకాలం వుండు. కాని ముందే చెపుతున్నా. నేను యెక్కువరోజులు వుండను" అని వాళ్ళపిన్నితో చెప్పి, చప్పున నా చేయిపట్టు కుని – "అంతేనా అక్కా? – మీరు నాకు మరీదగ్గరబంధు వులు కాదుగా!" అంది నాతో.

నేను ఆమె సూటిప్రశ్నకు జవాబివ్వకుండా, హేమను మనసారా కావలించుకున్నాను. పిన్ని ఎంతగడసరిదైనా హేమను అదుపులోవుంచటం ఆమెకు తలకుమించినపని! పిన్ని పైకికోపం కనబరచకుండా, హేమను బుజ్జగించటానికి ప్రయత్నిం చిందికాని ఆ పిల్ల దులబరించివేసింది. ఆమె దీనిని గారాబుపిల్ల మారాముగా యెంచి, యెగతాళిగా తీసుకుంది; లోనికి వెళ్ళ బోయి మళ్ళీ యేమాలోచించుకుందో, వెనుదిరిగి, ఆ పిల్లతో– "హేమా! నీకు స్నానానికి వేళఅయింది" అని చెప్పవచ్చింది.

హేమ నా వద్దకువచ్చి –"మేమిద్దరం రేవుకివెళ్ళి స్నానం చేస్తాం!" అని చెప్పింది.

వాళ్ళ పిన్నికి సుతరాము యిష్టంలేకపోయినా, సాహసించి కాదనలేకపోయింది. పెనగులాటకు దిగినా, హేమదే పైచేయి అని ఆమెకు తెలుసు! అదీగాక నా సమక్షంలో గుద్దులాడటం తేలికగాదు!

హేమ చెరువుకువెళ్తూ దారిలో – "అక్కా, నీ కడుపు పండలేదు యెందుకని?" అని అడిగింది.

నేను మందహాసంచేసి – "కారణం నాకేం తెలుసు, యింతకూ ఆ పరమాత్ముడు యివ్వలేదు!" అని చెప్పాను.

"అయితే పూర్వజన్మలో యేదో పాపంచేసుకున్నావు!"

"అదీ ఆ పరమాత్ముడికే తెలియాలి!"

"మా పిన్నినిచూడరాదూ? మనసుమంచిదికాదు. వట్టి కపటాత్మురాలు. అందుకనే ఆమె కడుపున వొక్క కాయ కాయలేదు" అని తార్కాణం చూపింది.

కష్టసుఖాలు, పాపపుణ్యాల సిద్ధాంతం నాకే తెలియదు–యింకా ఆ పిల్లకు నేనేం తెలియజెప్పను? దీర్ఘంగా నిట్టూర్చి లోలోపల 'నీవే తెలుసుకో' అని అనుకున్నాను. హేమ చప్పున నన్ను కావిలించుకుని, నవ్వి – "నా మాటలకుకూడా నిట్టూరుస్తున్నావా? అసలు నామాట ఎవరైనా లెక్కగడతారా" అని అంది.

క్రమంగా నా భర్త ప్రాక్టీసుకు అడ్డంకులు కలగసాగినవి. దూరాన్నుంచి పిలుపువస్తే, వెళ్ళటమే మానుకున్నారు. దగ్గర పిలుపుకు వెళ్ళినా, ఆదరాబాదరా ముగించుకుని యింటికి వచ్చి వాలేవారు! మొదట్లో తీరుబాటు చిక్కితే, మధ్యాహ్న

భోజనానికి నిద్రపోవటానికిమాత్రం లోనికి వచ్చేవారు! కాని వారి మేనత్త అయినప్పుడు, కానప్పుడు కబురుపెట్టేది; వారూ పనికట్టుకుని మేనత్త మంచి సెబ్బరలు విచారించటానికి వస్తూ వుంటారు. మేనత్త హేమను పిలిచి, ఆకువక్కలు తెమ్మనగానే ఆ గదిలో నా భర్తవున్నట్టు తెలిసిపోయేది! మొదట నాలు గైదు రోజులు హేమ, అవీ, యివీ అందించింది కాని తర్వాత ఎన్నిసార్లు పిలిచినా తను వెళ్ళకుండా దాసీచేత పంపేది. మేనత్త 'హేమా హేమా' అని కేకలుపెట్టేది కాని ఆ పిల్ల నామీది కరుణాతిరేకంతో ఎప్పుడూ నన్ను అంటిపెట్టుకుని వుండేది. హేమను వొక విధమైన విషాదఛాయలు అలముకున్నట్టుగా తోచేది. ఆ పిమ్మట పొరపాటునకూడా నా వద్ద వారి ప్రసంగం తెచ్చేదికాదు.

హఠాత్తుగా అన్నాయి వచ్చాడు నన్ను చూసి పోదామని. అన్నాయి దృష్టి చాలా తీక్ష్ణమైనది; – ఇక్కడి సంగతి సందర్భాలు, అతని దృష్టిని పడకుండా చేయటం అసంభవం! అన్నాయి కఠోరన్యాయమూర్తి! అన్యాయం రవంతకూడా సహించడు; న్యాయవిచారణలో కనికరమనేది యెరుగడు! నా భర్త అన్నాయిసమక్షాన అపరాధిగా నిలబడవలసివస్తుందేఅని, అన్నిటికంటె యెక్కువ భయంభయంగావుంది. నేనుజీవితం చాలా సుఖంగా గడిచిపోతున్నట్టు, అంతా కప్పిపుచ్చాను. అన్నాయి దగ్గర లోకాభిరామాయణం యేకరువుపెట్టి, యెన్నడూ లేని ఆదుర్దా కనపరచీ చాలాహడావుడి చేశాను కాని యివన్నీ నావట్ల అస్వాభావికంగా కన్పించి, నన్నుపట్టివ్వటానికి మూలమయినవి! నా భర్తకు కాళ్ళూ చేతులూఆడక,

అన్నాయి విషయంలో ముభావంగా వుండసాగాడు. ఇకను అన్నాయి యెక్కువరోజులు వుండలేక వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు స్వచ్ఛమైన పరిపూర్ణ స్నేహభావంతో నా శిరస్సున కంపిస్తున్న చేతిని చాలాసేపు వుంచి, యేకాగ్రచిత్తంతో లోలోపల నన్ను ఆశీర్వదించారని అర్థం చేసుకున్నాను. అన్నాయి కన్నీటి బిందువులు కన్నీటి చారికలుగట్టిన నా చెక్కిళ్ళమీద రాలసాగినవి.

అది చైత్రమాసమని బాగా గుర్తుంది. సందె చీకటి పడుతుండగా ప్రజలు సంతనుంచి తిరిగివస్తున్నారు. పెనుగాలి మోతలు పెడుతూ, వర్షాన్ని వెంటబెట్టుకు వస్తూవుంది. చినుకులు పడి మృత్తికలోనుంచి వస్తున్న వాసనలు, గాలిలోని తేమ ఆకాశాన్ని అలముకొంటున్నవి. చెల్లాచెదురయిన స్నేహితులు ఆ చిమ్మ చీకట్లో పరస్పరం గొంతెత్తి పిలుచుకుంటున్నారు. యీ కబోదిగదిలో యింకా దీపం పెట్టలేదు - నేను వొంటరిగా వున్నంతసేపూ, నా గుడ్డలు యెక్కడ ముట్టుకుంటవోనని దీపం వెలిగించరు. బావురు మంటున్న గదిలో నేలమీద చతికిలపడి, రెండుచేతులూ జోడించి ఆ పరమాత్మునికి మొరపెట్టుకుంటున్నాను- "ప్రభూ, కృపారసం నా మీద చిలకనప్పుడు, మీ లీలలు నాకు అంతుపట్టనపుడు ఈ అనాథ భగ్నహృదయపు చుక్కానిని ప్రాణప్రదంగా పట్టుకుని నా వక్షస్థలానికి హత్తుకుంటాను. గుండె చీల్చుకుని రక్తధారలు ప్రవహిస్తున్నవి; కాని తుఫానునుంచి కాపాడుకోలేకపోతున్నాను. నన్ను యింకా యెంతకాలం పరీక్షిస్తావు ప్రభూ, మీ అగ్నిపరీక్షకు నిలవగలశక్తి నాలో వున్నదా?"

అని విన్నవిన్తుండగానే కన్నీరు పొరలివచ్చింది. మంచానికి తల ఆనించి విలపించసాగాను. పగలంతా యింటో పనిపాటలతో సరిపోతుంది; హేమ నీడమాదిరి నన్ను వెన్నంటి తిరుగుతుంది. పొంగి పొరలివచ్చే కన్నీటినుంచి విముక్తి పొందటానికి కూడా నాకు అవకాశం దొరికేదికాదు. చాలరోజులకుగాను, యివాళ కన్నీరు ప్రవహించ సాగింది. ఇంతలో పక్క కొంచెం కదిలి, యెవరో మెసిలిన సవ్వడి అయింది. మరుక్షణమే నా కంఠం పెనవేసుకుని, నిశ్శబ్దంగా చెరగుతో కన్నీరు తుడవసాగింది. ఇవాళ సాయంకాలంనుంచి, హేమ యేమాలోచించుకుందో మరి, వచ్చి నా పక్కమీద పడుకుంది; అది నేను గ్రహించ లేదు! ఆ పిల్ల నన్ను యేమీ అడగలేదు;నాతో ఏమీ చెప్పనూ లేదు. నేనూ మాట్లాడించక వూరుకున్నాను. హేమ నెమ్మదిగా చల్లనిచేతితో నా తల నిమరసాగింది.

ఈలోపు యెపుడు మేఘాలు గర్జించినవో, యెప్పుడు గాలి వాన కొట్టిందో నాకేమీ తెలియదు. చాలాకాలానికి వొకవిధమైన స్నిగ్ధ ప్రశాంతి జ్వరతాప దగ్ధమయిన నా హృదయాన్ని శాంతపరచింది!

మరునాడు హేమ – "పిన్నీ, ముందే చెపుతున్నా, నీవు రాకపోతే, నేను కైవర్త భాయీని తోడుతీసుకుని వెళ్ళిపోతాను"అని చెప్పింది వాళ్ళపిన్నితో.

"వాడు తోడు దేనికి-రేపు నేనూ వస్తాను; కలిసివెళ్దాం. చూడు హేమా, అవినాశుడు నీకోసం ముత్యాలవుంగరం చేయించాడు!" అని అభిమానంతో పిన్ని, వుంగరం హేమ చేతిలో పెట్టింది.

"నా గురిచూాడు పిన్నీ!" అని హేమ కిటికీలోగుండా చెరువులోకి విసిరివేసింది. కోపంతో, దుఃఖంతో, ఆశ్చర్యంతో ఆమెశరీరం గగుర్పొడిచింది. ఆమె నన్ను పదేపదే స్తుతిస్తూ – "అమ్మాయి, యీ సంగతి అవినాశుతో చెప్పవద్దు. తెలిస్తే, చాలా నొచ్చుకుంటాడు. చెపితే నా మీాదవొట్టే!" అంది.

"అంతగా చెప్పాలా పెద్దమ్మా, వారితో నేను యేదీ చెప్పను."

ఆమరునాడు హేమ యింటికి బయలుదేరిపోతూ, నన్ను కావిలించుకుని – "అక్కా, నన్ను మరిచిపోయేవు, గుర్తుంచుకో" అని చెప్పింది.

నేను రెండుచేతులా ఆమె మోము నిమురుతూ – "కబోదులు యేదీ మరిచిపోరు చెల్లీ! మనసు మినహా, వాళ్ళకి మరో ప్రపంచ మేముంది?" అని చెప్పి, హేమను దగ్గరకు లాగుకుని, లలాటాన్ని ముద్దిడుకున్నాను. నా నేత్రాలనుంచి కన్నీటిబిందువులు హేమ శిరోజాలమీాద పడుతూవున్నవి.

హేమ వెళ్ళిపోయిన తర్వాత, ప్రపంచం వట్టిపోయినట్టుంది. ఆ పిల్ల వొకవిధమైన సౌందర్యసంగీతాలతో, వుజ్వల ప్రకాశంతో, కోమల తరుణత్వంతో నా హృదయాన్ని ముంచెత్తింది; అకస్మాత్తుగా ఆ పిల్ల మాయమయేటప్పటికి, గుడ్డి లోకంలో నలుగడలా 'నాది' అనేది యెక్కడ యేమివున్నదీ వొకసారి రెండుచేతులతో తడివిచూశాను!

ఆ నాడు వారు మహాసంతోషం వెలిబుచ్చుతూ నా వద్దకువచ్చి – "వీళ్ళుపోవటం పెద్దబరువుతీసివేసినట్టుంది. యిక

కాస్త పనిపాటలుచూసుకోవటానికి వ్యసులుబాటు చిక్కింది!"
అన్నారు.

నా పట్ల యింతచాతుర్యం, కపటం దేనికి? యదార్థం తెలిస్తే, నేను భయపడిపోతానా? ఆపదలకు నేను యెన్నడైనా తొణికి యెరుగుదునా! వారి సుఖమే నా సుఖంగా భావించి, నా రెండు నేత్రాలూ సమర్పించిననాడు, పరమానందంతో చిరాంధకారాన్ని నేను స్వీకరించానని వారు యెరగరూ?

ఇప్పటిదాకా మా యిద్దరిమధ్య అంధత్వమే అడ్డు గోడగా వుంది. కాని నేటినుంచి మరోగోడ లేచింది. వారు నా వద్ద, హేమ వారిలోకంలోనుంచి యెప్పటికీ లుప్తమయి నట్టు, వారిమనసుమీాద హేమఛాయకూడా పడనట్టు, ఆప్రసక్తే తెచ్చేవారు కాదు. కాని వుత్తరాలద్వారా ఆ పిల్ల కబుర్లు తెలుసుకుంటున్నారని నేను సులభంగానే పసికట్టేదాన్ని! చెరువులోకి వర్షపునీరు యేమాత్రం కొట్టుకువచ్చినా, కమల నాళంలో మార్పుకలుగుతుంది. అదేవిధంగా వారి ఆవేశఉద్రే కాలనుబట్టి ఆంతర్యము గ్రహించగలిగేదానిని! ఆకర్షణే అలాంటిది! కాని నేను వారివద్ద హేమమాట తలచకూడదు. చీకట్లుకమ్మిన నా హృదయాకాశంలో క్షణకాలంపాటు వుద యించిన నిరంకుశ, వుజ్జ్వలతారనుగురించి తెలుసుకోవాలనీ, మాట్లాడాలనీ నాప్రాణంకొట్టుకులాడేది కాని, వారివద్ద హేమ పేరు యెత్తే అధికారంలేదు. యిలా మా యిరువురిమధ్య శబ్దా లతో, బాధతోకూడిన వొకవిధమగు నీరవత ఘనీభవించింది; అది తలచుకొని నా హృదయం ఆవురుమనేది.

వైశాఖమాసం సగపడి జరిగినాక, దాసీ వచ్చి -"అమ్మగారూ, ఇవాళ నదివొడ్డున నావ సిద్ధంచేసివుంది; అయ్యగారు యెక్కడికైనా. వెళ్లుతున్నారా?" అని అడిగింది.

యేదో సన్నాహం జరుగుతున్నట్టు చూచాయగా విన్నాను. మళ్ళీ నా భాగ్యాకాశంలో తుఫాను వచ్చేముందు మాదిరి నిస్తబ్ధత ఆ పిమ్మట చెల్లాచెదురుగావున్న ప్రళయకాలమేఘాలు కమ్ముకురావటం కన్పిస్తూంది. సృష్టిసంహారంచేసే శంకరుడు, మునివేలి సైగతో ప్రళయశక్తినంతా నా శిరసుమీద కేంద్రీకరించి వుంచినట్టు నా అనుభవానికి వస్తూవుంది. నేను దాసీ మనిషితో – "నాకేమీ తెలియదే!" అన్నాను.

దాసీ మళ్ళీ అడగటానికి సాహసించలేక, దీర్ఘంగా నిట్టూర్చి వెళ్ళిపోయింది.

వారు బాగా ప్రొద్దుపోయి వచ్చి నాతో – "దూరం నుంచి పిలుపు వచ్చింది; చీకటితో బయలుదేరాలి. తిరిగివచ్చేటప్పటికి రెండు మూడు రోజులు పడుతుంది" అని చెప్పారు.

నేను చువ్వలాగా పక్కమీదనుంచి లేచి నిలబడ్డాను. "నాతో అబద్ధాలు చెప్పటం దేనికి?"

వారు కంపించే కంఠంతో – "అబద్ధాలేం చెప్పాను?" అన్నారు.

"మీరు పెళ్ళిచేసుకోటానికి వెళుతున్నారు!"

వారు యేమీ మాట్లాడలేదు. నేనూ అలానే కదలకుండా నిలబడ్డాను. చాలాసేపు నిశ్శబ్దత తాండవించింది. చివరికి నేనే – "పలకరేమండీ, 'అవును నేను – పెళ్ళిచేసుకోట్టానికి వెళ్ళుతున్నా'నని చెప్పండి!" అన్నాను.

వారు ప్రతిధ్వని మాదిరి – "అవును, పెళ్ళిచేసుకోటానికి వెళుతున్నాను" అని సమాధానమిచ్చారు.

"లేదు, మీరు వెళ్ళటానికి వీల్లేదు. మిమ్మల్ని ఈ ఆపదనుంచి, పాపంనుంచి రక్షించితీరుతాను. ఈ మాత్రం కూడా నా వల్ల కాకపోతే మీకు భార్యనైన ప్రయోజన మేమిటి? ఇన్నాళ్ళనుంచి చేసిన శివపూజ దేనికి?"

మళ్ళీ నిశ్శబ్దత వ్యాపించింది. నేను వారిపాదాలు రెండూ పట్టుకుని– "మీరు రెండో పెళ్ళి చేసుకోవలసిన అవసరం యేమొచ్చింది? నేను చేసిన అపరాధమేమిటి? – నా మీద వొట్టే, నిజంచెప్పండి!" అని అడిగాను.

అంతట వారు నెమ్మదిగా చెప్పసాగారు – "నిజమే చెపుతాను! అంధత్వము నన్ను వొకవిధమైన అనంతావరణలో గిరిగీసి వుంచింది. నేను అందాకా చేరలేకపోతున్నాను. నీవు నా దేవతవు; దేవతమాదిరి భయంకరమైనదానివి; సంసారుల మాదిరి నీతో కాపురం చేయలేను. నేను కోప్పడటానికీ సరస సల్లాపాలాడటానికి, గుడ్డలు – నగలు తెచ్చియివ్వటానికి సాధారణ స్త్రీని పెళ్ళాడాలనుకున్నాను!"

"నేనొక సాధారణస్త్రీని అవునోకాదో నా హృదయం చీల్చిచూడండి; పెళ్ళినాటి బాలికవినా నేను మరేమీ కావని మీకే తెలిసిపోతుంది. నేను భక్తిశ్రద్ధలు చూపాలనుకున్నాను, మిమ్ములను పూజించాలనుకున్నాను. మిమ్మల్ని మీరే అవమానించుకుని, నన్ను భరింపరాని దుఃఖంలో ముంచి, నన్ను మీకంటె గొప్పచేయవద్దు. నన్నుసమస్త విషయాల్లో మీ చరణదాసిగా యెంచండి."

నే నేమి మాట్లాడిందీ నాకు జ్ఞప్తివుండా. ఘూర్ణిల్లే సముద్రం తన శబ్దం వినగలదా? - నాకు కొన్ని మాటలు లీలగా గుర్తున్నవి. "భగవత్ సాక్షిగా నేనే గనక పతివ్రతనైతే యేవిధంగానూ, మీరు చేసిన ప్రతిజ్ఞ భంగపరచలేరు. ఆ మహా పాపం ఘటిల్లేముందే, నా పసుపు కుంకమ అయినా పోతుంది; లేదా హేమ అయినా జీవించివుండదు" అంటూ వుండగానే స్పృహతప్పి పడిపోయాను.

నాకు తెలివి వచ్చేటప్పటికి యింకా కాకులు కూయ లేదు. వారు వెళ్ళిపోయారు.

నేను పూజామందిరంలో తలుపులు గడి వేసి పూజకు కూచున్నాను. పగలంతా బయటికి కాలుపెట్టలేదు. సందెవేళ తుఫాను ప్రారంభమయింది. ఇల్లంతా వూగిపోతున్నట్టుంది. అయినప్పటికీ "నాభర్త నదిమీద ప్రయాణం చేస్తున్నారు. వారిని రక్షించు ప్రభూ!" అని ప్రార్థించలేదు. నేను యేకాగ్రచిత్తంతో - "పరమాత్మా! నా నొసటివ్రాతను తప్పించ నెవరి వశం? కాని నా భర్తనుమాత్రం ఈ మహాపాతకంనుంచి కాపాడ"మని వేడుకున్నాను.

ఆ రాత్రి గడచిపోయింది. మరునాడుకూడా నేను పూజమీదనుంచి లేవలేదు. నిద్రాహారాలు లేకపోయినా, నా కెంత బలిమి యెక్కడనుంచివచ్చిందో తెలియదు-ఆ పాషాణ విగ్రహంవద్ద విగ్రహంమాదిరే కదలకుండా కూర్చున్నాను.

సాయంకాలం బయట యెవరో తలుపు తట్టిన చప్పుడు వినిపించింది. తలుపులు బ్రద్దలుచేసి లోపలికి వచ్చేసరికి నేను తెలివితప్పి పడివున్నాను.

నాకు స్పృహ రాగానే 'అక్కా' అని పిలుపు విన బడింది. కన్ను తెరిచి చూశాను; నేను హేమ వొడిలో తల పెట్టి పడుకుని వున్నాను. తలతిప్పగానే, ఆమె పెళ్ళిదుస్తుల్లో వున్నదని గ్రహించాను. నా నవనాడులూ కుంగిపోయినవి. 'ప్రభూ, నా ప్రార్థన ఆలకించలేదా? చివరికి నా భర్త పతన మవనే అయాడు.'

హేమ తలవంచుకుని నెమ్మదిగా – "అక్కా, నీ ఆశీ ర్వాదంకోసం వచ్చాను!" అన్నది.

మొదట నేను నివ్వెరపోయాను; కాని మంత్రణానే తేరుకుని లేచి కూచుని – "నిన్ను ఆశీర్వదిస్తాను చెల్లీ! ఇందులో నీ తప్పేముంది?" అన్నాను.

హేమ తేనెలొలుకు సహజస్వరంతో నవ్వి – "తప్పా! నీవు పెళ్ళిచేసుకుంటే తప్పులేదు! నేను చేసుకుంటే తప్పు వచ్చిందా!" అంది.

హేమ నన్ను కావలించుకుని వూరకే నవ్వుతూవుంది. 'ప్రపంచంలో నా ప్రార్థన వొక్కటీ లెక్కింపదగినదా? నారి కోరికకుమాత్రం విలువలేదా? నా శిరసునే వజ్రపాతమవుగాక! కాని హృదయములోని భక్తిశ్రద్ధలను వీసమెత్తుకూడా తరుగ నివ్వను. నేను యెప్పటిమాదిరే వుంటాను' అని మనసులో అనుకున్నాను.

హేమ నా పాదధూళి తీసుకుని నొసట అద్దుకుంది. "నీవు చిరసౌభాగ్యవతివి, చిరసుఖివికమ్మ"ని ఆశీర్వదించాను.

"ఇవాళ ఆశీర్వదించటంతో నిన్నువిడిచిపెట్టను అక్కా! నీ చెల్లికి, మరిదికి నీ చేతులమీదుగానే మూడు ముళ్ళూపడాలి!

నీవు పతివ్రతవు; నీ ఆశీర్వాదబలమే మా జీవితాలకు కాణాచి! అక్కా, వారికి చాటుకుపోతే కుదరదు. అనుమతిస్తే, లోనికి తీసుకొస్తాను."

"సరే, తీసుకురా!"

కాసేపటికి గదిలో అపరిచితమైన కాలి అలికిడి అయింది. "కుమూ, క్షేమమా?" అని, స్నేహపూరితమైన ప్రశ్న నా చెవిని పడింది.

నేను ఆదరా బాదరా మంచంమీాదనుంచి లేచి, వారి పాదాలకు నమస్కరించి – "అన్నాయ్!" అన్నాను.

"అన్నాయి ఎట్లా అవుతాడు? గుర్తుకు చెవి మెలిపెట్టు– ఇక అన్నాయికాదు, మరిది!"

అప్పుడు అంతా తేట తెల్లమయింది. వివాహం చేసుకోనని అన్నాయి పంతంపట్టాడు. తల్లి లేదు; చెప్పి వొప్పించే పెద్దవాళ్ళెవరూలేరు – బహుశా అన్నాయి పెళ్ళికి నేనే కారకురాలిని అయాను! నా నేత్రాలనుంచి అశ్రుధారలు కురియసాగినవి; ఎంత ప్రయత్నించినా నిగ్రహించుకోలేక పోయాను. అన్నాయి నెమ్మదిగా నా తల నిమురుతున్నాడు; హేమ నన్ను కావిలించుకుని అదేపనిగా నవ్వుతూవుంది.

రాత్రికి కునుకుపట్టలేదు; ఆదుర్దాగా భర్త రాకకోసం నిరీక్షిస్తున్నాను. వారు లజ్జా నిరాశలను యెలా తోసివేసుకు తిరుగుతారో నాకేమీా తోచకుండావుంది.

నడిరాత్రికి యెవరోతలుపు నెమ్మదిగా తెరిచినట్టుంది. నేను త్రుళ్ళిపడి లేచి కూర్చున్నాను. నా భర్త పాదాలసవ్వడి! ఆనందం పట్టలేక, నా మనోశరీరాలు పురకలు వేయసాగినవి.

వారుకూడా పక్కమీద కూచుని, నా చేయిపట్టుకుని చెప్పసాగారు - "మీ అన్నాయి నన్ను కాపాడకపోతే, క్షణిక వ్యామోహంలోపడి కొట్టుకుపోయేవాణ్ణే! ఆ నాడు నావమీద అడుగిడినపుడు, నా గుండెలమీద యెంత పెద్దభారం మోపి నట్టుందో నాకు తెలియాలి, ఆ పరమాత్ముడికి తెలియాలి. తుఫానువీచినపుడు, ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకున్నాము. కాని నౌకాభంగం కావటమే, నాకు తరుణోపాయమని భావించాను. ఆ వూరుచేరగానే, ఆ కిందటిరోజే మీ అన్నాయి హేమను వివాహం చేసుకున్నట్టు తెలిసింది. ఎంత సిగ్గుతో, ఆనందంతో నావలో తిరిగివచ్చానో చెప్పజాలను. ఈ రెండురోజులకే, నీవులేనిది నా జీవితానికి శాంతంగాని సౌఖ్యంగాని లేవనీ, నీవు నా దేవతవనీ చక్కగా అర్థమయింది."

నేను నవ్వి - "వద్దు, నన్ను దేవతనుచేయవద్దు; నేను మీయిల్లాలిని; నేను మీకు భార్యను; మరేమీకాను" అని చెప్పాను.

"నీవు నా మాటకూడా వొకటి వినాలి. నేటినుంచి నీవు యెప్పుడూ నన్ను దైవమని పిలిచి, చిన్నబుచ్చవద్దు. నేనూ నీకు సాధారణమైనభర్తను; నీ ప్రియుణ్ణి; అంతకు మించి, మరేమీకాను."

మరునాడు మేళతాళాలతో వూరంతామారుమ్రోగింది.

నా భర్త హేమ కంటపడితేచాలు; వేళాపాళాలేకుండా వారికి తాటాకులుకట్టి, ముప్పాతిప్పలుపెట్టి వేపుకతినేది! కాని వారు యెక్కడికి వెళ్ళారనిగాని, అక్కడ యేమిజరిగిందని గాని, యెవరూ నా దగ్గర ఆ ప్రసక్తి తెచ్చేవారుకాదు.

—0—

# పెళ్లికూతురు

ఈ విషయం యీనాటిదికాదు. చిన్నప్పుడు నేను చదువుకునేబళ్లో శివనాథపండితులు, క్రిందితరగతికి యెక్కాలు చెప్పేవారు. వారు గడ్డం, మీసాలు తుడిపించారు; తల నున్నగా గొరిగించి, గోష్పాదమంత పిలక పెట్టుకున్నారు. వారిని చూస్తేచాలు, పిల్లల పైప్రాణాలు పైనే పోయేవి.

సర్వసాధారణంగా జీవుల్లో కొండెమున్నవాటికి దంతా లుండవు. కాని మా పండితులవారివిషయంలో యీ రెండూ సార్థకమవుతున్నవి. ఒకచెంపన, మొక్కలవంటి మా బోటి పసికందులమీద చెంపదెబ్బలు – గుద్దులు వడగళ్ళవానవలె వర్షించేవి, మరోచెంపన కర్ణకఠోరమైన వారితిట్లు చిన్ననాటి వృగ్గును తలపించేవి.

'గురు శిష్యులసంబంధం పూర్వకాలంమాదిరి లేకుండా పోయింది; విద్యార్థులు యిప్పుడు గురువును దైవసమానంగా పూజించటంలేదు' అని చింతిస్తూవుండేవారు. పండితులవారు. ఇలా విచారం వెలిబుచ్చి, తమ వుపేక్షితదైవమహిమ ప్రభావాన్ని మా నెత్తిమీద చూపేవారు! అప్పుడప్పుడు పైకప్పు యెగిరిపోయేటట్టు గర్జించేవారు; కాని ఆ గర్జనలో మిళితమై వుండే అశ్లీలపదాలు చెవిసోకగానే, దాన్ని దేవతల అపర వజ్రనాదంగామాత్రం యెవరూ భ్రమకు లోనయ్యేవారుకాదు.

ఏమైనాకానీ, మా స్కూల్లోవొక్కరుకూడా, మూడో తరగతి, రెండో సెక్షనులోని గురుదేవుని, యింద్ర చంద్ర

సమున్ణిగా యెంచేవారుకాదు. అందాకావస్తే యమధర్మ రాజుతో పోల్చేవారు! ఇంతకాలం గడచిపోయినాక, నాస్త్ర వాన్ని అంగీకరించడంలో దోషంలేదు; భయమూలేదు — అప్పుడు పిల్లలందరమూ శివనాథపండితులు, జాప్యం చేయకుండా, తక్షణమే యమసదనానికి పంచేస్తే బాగుండునని మనసులో అనుకునేవాళ్ళం!

కాని మా అందరికీ, నరదేవతతో సమమైన బెడద మరొకటి లేదని చక్కగా తెలిసివచ్చింది. సురలోకవాసులైన దేవతలు మనలను వేపుకు తినరు. వారు రెండుపూలు తెచ్చి అర్పిస్తే చాలు, పరమానందభరితులవుతారు; ఒకవేళ యివ్వక పోయినా మనలను కొరత వేయబోరు! కాని మా గురుదేవులు ఆశాపాతులు; మావల్ల యే చిన్నపొరపాటుజరిగినా, గుర్లెర్ర చేసి, మామీద విరుచుకు పడేవారు. అప్పుడు యేవిధంగా చూసినా, దేవసములుగా కన్పించేవారు కాదు!

పిల్లలను వేపుకు తినటానికి శివనాథపండితులు బ్రహ్మాస్త్రం వొకటి కనిపెట్టారు. అది వినటానికి సాధారణమైనదిగా తోచవచ్చు కాని వాస్తవానికి మహాభయంకరమైనది! వారు పిల్లలకు కొత్త కొత్త పేర్లు పెట్టేవారు. పేరు శబ్దం విన్నా మరేమీ కాదు. అయినప్పటికీ మానవుడు తనకన్న, తన పేరును యెక్కువగా ప్రేమిస్తాడు. లోకులు తమ పేరుప్రతిష్ఠలకోసం యెన్ని కష్టాలు పడటంలేదు? చివరికి పేరునిలుపుకోటానికి ప్రాణాలు అర్పించటానికి సైతం, సంకోచించరు!

పేరుకోసం ఆహుతి అయే మనిషి పేరు వికృతంచేయటం అతనికి గొడ్డలిపెట్టులా వుంటుంది. అందాకాయెందుకు,

'భూతనాథు'ని, 'నళినీకాంతు'డని పిలిచినా, అతనికి కంట గింపుగా వుంటుంది.

దీనినిబట్టి, మనమొక నిర్ణయానికి రావచ్చు; మానవుడు పదార్థంకన్న, అపదార్థానికి యెక్కువ విలువనిస్తాడు. అంటే, వెండి – బంగారులకంటె, మాటను, ప్రాణాలకన్న మానాన్ని తనకంటె, తనపేరును గొప్పగా యెంచుతాడు.

మా శివనాథపండితులు, శశిశేఖరునికి 'చుంచు' అని పేరు పెట్టినపుడు, మానవస్వభావంలో గర్భితమైవున్న యీ నిగూఢ నియమానువర్తియై, పాపం ఆ కుర్రవాడు చాలా దుఃఖించాడు. ప్రత్యేకించి, యీ నూతన నామకరణంవల్ల, పిల్లకాయలందరూ ఆ కుర్రవానిముఖంవంక తేరిపారజూస్తుంటే వాడి ఆవజీవాలు కుంగి, కుమిలిపోయేవాడు. అయినా మహా శాంతంతో సహిస్తూ, మెదలకుండా కూర్చునేవాడు.

శివనాథపండితులు ఆశుతోషుకు 'పెళ్ళికూతురు' అని మారుపేరు పెట్టారు. ఆ పేరువెనక కొంత గాథవుంది!

ఆశు వాళ్ళ క్లాసులో చాలా బుద్ధిమంతుడు; అర్భకుడు. పిల్లలతగవులు ఆ కుర్రవాడి జాతకంలోనే లేవు; మెదలకుండా వొకమూలన కూర్చునేవాడు. వాడికి తగని బిడియం! వయసులో అందరికంటె పిన్న. అన్నిటికీ నవ్వుతూండేవాడు. కాని చదువులో మిన్న! స్కూలు పిల్లలు చాలామంది వాడితో స్నేహంకోసం తాపత్రయపడ్డారు. కాని ఆశు యెవరితోనూ కలిసేవాడు కాదు. యింటి గంట మోగగానే, తుర్రున యింటిదారిపట్టేవాడు.

మధ్యాహ్నం విశ్రాంతిసమయంలో, పనిమనిషి యింటి వద్దనుంచి ఫలహారము, మంచినీళ్ళు పట్టుకొచ్చేది. అందుకు చాలా నామోషీగావుండి, పనిమనిషి యింటికి వెళ్ళితే, బ్రతికి పోతాననుకునేవాడు. తాను విద్యార్థిగా కాక, మరోవిధంగా పిల్లలికి తెలియటం ఆశుకు యిష్టంలేదు. తాను ఫలానావారి పిల్లవాడిననీ, తనకు ఫలానావారు అక్క-చెల్లెళ్లు, అన్నదమ్ము లనీ పిల్లలకి తెలియటం మహాపరాధమయినట్టు, గోప్యంగా వుంచటానికీ సర్వదా ప్రయత్నిస్తుండేవాడు.

చదువుసంధ్యల్లో ఆశు యెవరికీ తీసిపోడు. కాని బడికి రావడం అప్పుడప్పుడు ఆలస్యమయేది. శివనాథపండితులు నిల దీసి సంజాయిషీ అడిగితే, నీళ్ళు నమిలేవాడు! అందుకు గట్టిగా చీవాట్లు పడేవి! మళ్ళీ, ఆశుచేత గోడకుర్చీ వేయించే వారు; పిల్లలందరూ, అన్నితరగతులవారూ ఆ కుర్రవాణ్ణి వచ్చి చూచిపోయేవారు.

ఒకరోజు స్కూలుకు సెలవిచ్చారు గ్రహణాన్ని పుర స్కరించుకొని. మరునాడు పండితులవారు వున్నతాసనంమీద కూర్చునివున్నారు. యింతలో ఆశు పలకా దస్తరం చంకన పెట్టుకుని పూర్వంకంటె యింకా యెక్కువ సంకోచిస్తూ, క్లాసులోకివచ్చాడు.

శివనాథ పండితులు శుష్కహాసం చేస్తూ – "ఓహో, పెళ్ళికూతురు వచ్చిందే?" అన్నారు.

విశ్రాంతిగంట కొట్టబోతారనగా శివనాథపండితులు పిల్లలందరినీ ఉద్దేశించి – "అబ్బాయిలూ, అందరూ వినం డర్రా–" అని చెప్పసాగారు.

భూమ్యాకర్షణశక్తి ఆ పసికాయను బలంగా తన కేంద్రంవైపుకు ఆకర్షిస్తూవుంది; అయినా వాడు కుర్చీళ్ళు వదలి, కాళ్ళు వ్రేలాడవేసుకొని, అందరిదృష్టికి లక్ష్యమై బెంచీమీద కదలకుండా కూర్చున్నాడు. ఇప్పటికి ఆ కుర్ర వాడికి చాలా ప్రాయం వచ్చివుంటుంది; జీవితంలో యెన్నో కష్టసుఖాలు అనుభవించివుంటాడు. సిగ్గిలవలసిన సమయాలు కూడా కొన్ని తటస్థించి వుండవచ్చు. కాని ఆనాటి బాలహృదయావస్థతో దేనినీ పోల్చవీలులేదు. ఇది చాలా చిన్నవిషయమే; రెండుముక్కల్లో ముగించవచ్చుకూడా. అయినా అందులో వొకరహస్యం గర్భితంగా వుందని అంగీకరించక తప్పదు.

ఆ కుర్రవాడికి వొకచెల్లెలువుంది; ఆ పిల్లతో తోడుగా ఆడుకోవటానికి ఆ యీడు వారెవరూ జతలేరు. అందువల్ల ఆ పిల్ల ఆశుతో ఆడుకునేది.

ఇనప కటకటాల గేటువున్న దే వాళ్ళయిల్లు! యెదురుగా బండి వుంచటానికి వరండావుంది; ఆరోజు బాగా వర్షం కురుస్తూవుంది. జనం ఒకళ్ళు - అరా, చెప్పులు చేతపట్టుకుని గొడుగు వేసుకొని వస్తూపోతున్నారు యెటూ చూడకుండా! మబ్బుపట్టిన చీకట్లో, వర్షపుమోతలో వరండాక్రింద మెట్ల మీదకూర్చుని, సెలవుదినం కావటంచేత, ఆ కుర్రవాడు చెల్లెలితో ఆడుకుంటున్నాడు.

ఆనాడు బొమ్మలపెళ్ళి! ఆశు వివాహప్రయత్నాలను గురించి, చెల్లెలికి గంభీరంగా వుపన్యసిస్తున్నాడు.

పురోహితుడు యెవరనే ప్రశ్న వచ్చింది. ఆ బాలిక చప్పున పరుగెత్తుకుంటూ వెళ్ళి, అక్కడ నిలబడివున్న వ్యక్తిని "యేమండీ, బొమ్మలపెళ్ళికి పురోహితులుగా వుంటారూ?" అని అడిగింది.

ఆశు వెనుదిరిగిచూశాడు ; శివనాథపండితులు వర్షానికి తడిసి ముద్దయి, నీళ్ళుధారగాకారే గొడుగుమడిచి, నిలబడి వున్నారు. దారినిపోతూ, వర్షం పెద్దదయితే, లోనికివచ్చారు. ఆ బాలిక వారిని పౌరోహిత్యం చేయమని బలవంతంపెడుతూ వుంది.

శివనాథ పండితుని చూడగానే, ఆశు బొమ్మలపెళ్ళి వెడిచిపెట్టి యింట్లోకి దౌడుతీశాడు. ఆనాటి సెలవుశాస్త్ర యిలా వ్యర్థమైపోయింది.

మరునాడు వారు శుష్కహాసంతో పీఠికగా యీ ఘటన నుల్లేంఖించి, ఆశుకు 'పెళ్ళికూతురు' అని నామ-కరణం చేశారు. అప్పుడు ఆ కుర్రవాడు యెప్పటిమాదిరే నలుగురితో పాటు నవ్వటానికి ప్రయత్నించాడు - ఇంతలో విశ్రాంతిగంట విన్పించింది ; పిల్లలందరూ బయటికి వెళ్ళిపోయారు ; గేటుపద్ద పనిమనిషి ఫలహారము, తళతళ మెరిసే పూలగ్లాసుతో మంచి నీళ్ళు తీసుకుని నిలబడివుంది.

నలుగురితోపాటు నవ్వినందుకు ఆశు ముఖము, చెవులు జేవురించినవి; నుదుటినరాలు వుబికి స్పష్టంగా కన్పిస్తున్నవి; పొర్లుకొచ్చే కన్నీరు గుడ్డకుక్కకోవటం కష్టసాధ్యమయింది.

శివనాథపండితులు విశ్రాంతిగదిలో ఫలహారం చేసి, తాపీగా గుడుగుడు పీలుస్తున్నాడు. పిల్లలు ఆశూ చుట్టూచేరి 'పెళ్ళికూతురు పెళ్ళికూతురు' అని గేలిచేస్తున్నారు. ఆ కుర్ర వాని దృష్టిలో, ఆనాడు సెలవురోజున చెల్లెలితో ఆడుకున్న 'బొమ్మలపెళ్లి' జీవితంలో అన్నిటినీమించి, లజ్జాకరమైన వొక భ్రమగాతోచసాగింది. లోకులు ఆనాటిఘటనను ఎప్పటికీ విస్మ రించగలరనే నమ్మకం ఆ కుర్రవానికి యేమాత్రం కలగలేదు.

—0—

# జీవన్మరణాలు

రాణీఘాటు జమీందారు శారదాశంకరుని విధవమరదలికి, పుట్టింటగాని, అత్తవారింటగాని 'నా' అని చెప్పుకోతగ్గవారెవరూ లేరు. ఆమెకు పిల్లాజెల్లాకూడా లేరు. బావగారు, శారదాశంకరుని కొడుకంటే, ఆమెకు పంచప్రాణాలు! ఆ పిల్లవాడు పుట్టినపుడు, తల్లికి పెద్దజబ్బుచేసి, చాలాకాలం మంచాన పడి లేచింది. అందువల్ల ఆ కుర్రవాణ్ణి విధవపినతల్లే తన చేతులమీదుగా సాకింది.

సాధారణంగా, పరాయిపిల్లలను పెంచి పెద్దచేసినపుడు, ఆ పిల్లలమీద మన హృదయంలో స్నేహమమకారాలు, ఆకర్షణ మినుమిక్కిలిగా వుండవచ్చు! కారణం, సాంఘికంగా వాళ్ళమీద హక్కేమీ వుండదు, సామాజిక హక్కులేకుండా, స్నేహమమకారాలుమాత్రం వున్నతావున, అవి తమ సమత్వాన్ని యెలా నిరూపించుకోగలవు? — అలా ప్రయత్నించవు కూడా! తమ అనిశ్చిత హృదయధనాన్ని ద్విగుణీకృత వుద్వేగంతో, అంతకు మించిన వ్యాకులపాటుతో ప్రేమిస్తూమాత్రం వుంటవి!

విధవ కాదంబిని, కట్టలు తెగిన ప్రేమప్రవాహంలో ఆ కుర్రవాణ్ణి ముంచెత్తి, అకస్మాత్తుగా దేహయాత్ర చాలించింది. ఒకనాడు వున్నట్టుండి, ఆమెగుండె ఆగిపోయింది. ప్రపంచములోని కార్యకలాపాలు యథావిధిగా జరుగుతున్నవి కాని ఆ

స్నేహపూరితహృదయంలోని కాలయంత్రం పనిచేయకుండా పోయింది!

పోలీసుబెడద యేమి వచ్చిపడుతుందోనని, జమీందారు గారు నిరాడంబరంగానే నలుగురు బ్రాహ్మణులతో దహన క్రియలు పూర్తిచేద్దా మనుకున్నారు.

శ్మశానం వూరికి కొంచెం పెడగావుంది. చెరువుగట్టున వొక పెద్దగుడిసె, దాని నానుకుని వూడలుదిగిన మర్రి వుంది. అక్కడనుంచి చూస్తే, నలువైపులా మైదానం! పూర్వం అక్కడే వొక నది ప్రవహించేది; కాని యిప్పుడు యెండి పోయింది. అక్కడే కొంతమేర తవ్వి, చెరువుచేశారు; దాన్నే గ్రామస్తులు యిప్పటికీ నదిగా యెంచుతారు!

♦ పాడె గుడిసెలోపెట్టి, ఆ నలుగురూ కట్టెలకోసం యెదురుచూస్తూకూర్చున్నారు. కూర్చునికూర్చుని విసుగుపుట్టి, ఆలస్యానికి కారణమేమిటో తెలుసుకుందామని ఆ నలుగురిలో ఇద్దరు బయలు దేరారు. మిగతా యిద్దరూ పాడెవద్ద కూర్చున్నారు.

శ్రావణమాసం; చీకటిరాత్రి! ఆకాశం మెఱుపులు చేస్తూవుంది; ఎక్కడా వొక్కనక్షత్రంకూడా కన్పించటంలేదు. యిద్దరూ చీకట్లో నిశ్శబ్దంగా కూర్చున్నారు. వొకరి వుత్తరీయాన అగ్గిపెట్టె, మైనపువత్తి వుందికాని వర్షానికి తడారి, యెన్నిపుల్లలుగీచినా, మండలేదు. పైగా తెచ్చిన లాంతరు కూడా కొండెక్కింది!

---

♦ బెంగాలులో శవాన్ని పాడెకట్టరు; మంచంతోటే తీసుక వెళ్లతారు.

చాలాసేపు మౌనంగా గడిచిపోయింది. "ఆ తొందరలో చిలుము తేవటం మరిచిపోయాము. తెస్తే, యెంతబాగుండేది." అన్నాడు విధు!

"చవ్వాన పరుగెత్తుకెళ్ళి, తెచ్చేదీ?"

వనమాలి, పారిపోవటానికి విధు వేసినయెత్తు గ్రహించి - "ఏదీ, అయ్యమొహం ఇల్లా చూపూ! నీవు వెళ్ళి వచ్చార్లగొట్టు, నేనేమో యిక్కడ బిక్కుబిక్కుమంటూ కూచుంటాను!" అన్నాడు.

తర్వాత యెవరూ మాట్లాడలేదు. నిముష మొక ఘడియలావుంది. కట్టెలు తీసుకురాబోయినవాళ్ళని లోలోపల తిట్టుకోసాగారు. వాళ్ళిద్దరూ యెక్కడో తీరిగ్గా కూర్చుని, కబుర్లు చెప్పుకుంటూ, ధూమపానం చేస్తుంటారనే వాళ్ళ అనుమానం బలపడసాగింది.

చుట్టూ బావురుమంటూవుంది. చెరువు కట్టమీదనుంచి కీచురాళ్ళమోత, కప్పలబెకబెకలు తియ్యకుండా విన్పిస్తున్నవి. ఇంతలో మంచం కొంచెం కదిలినట్టు, శవం పక్కకు వొత్తిగిలినట్టు వుంది!

విధు, వనమాలి యిద్దరూ కంపమెత్తి, రామనామం జపింపసాగారు. గుడిసెలో ఎవరో గట్టిగా నిట్టూర్చినట్టుంది! యిద్దరూ బయటికి వొక్క దూకు, దూకి కాలికి బుద్ధిచెప్పారు.

ఇంచుమించు ఒక మైలు వెళ్ళినాక, కట్టెలకోసం పోయిన స్నేహితులిద్దరూ లాంతరు చేతపట్టుకు వస్తున్నారు. నిజానికి వాళ్ళు ధూమపానమే చేస్తున్నారు! కట్టెలసంగతి

వారికేమీ తెలియకపోయినా - "చెట్టుకొట్టారు, కట్టెలు వచ్చేస్తున్నవని" అనిచెప్పారు ముందుగానే!

విధు, వనమాలి గుడిసెలో జరిగినకథ యావత్తూ పూస గుచ్చినట్టు చెప్పారు. నితాయీ, గురుచరణునికి వాళ్ళ మాట మీద నమ్మకం కలగలేదు. తేలికగా త్రోసివేశారు. శవాన్ని అలానే విడిచిపెట్టి వచ్చినందుకు తలవాయ చీవాట్లు పెట్టి, వృధాగా కాలయాపన దేనికని శ్మశానంవైపుకు కాలు సాగించారు. అక్కడికి వెళ్ళి చూస్తే, శవం పత్తాలేదు. మంచం ఖాళీగాపడివుంది!

నలుగురూ వొకరిమొగాలు వొకరు చూసుకున్నారు. నక్కలు లాక్కుపోయిననేమో! కాని యెక్కడా గుడ్డపీలిక కూడా కనిపించటంలేదు! వెదికి వెదికి వేసారిపోయారు; చివరికి ఆ గుడిసె వెలుపలి బురదలో వొక స్త్రీ అడుగు జాడలు కన్పించినవి. ఇక ఆ నలుగురూ తల పట్టుకొని ఆలోచనలో పడ్డారు - శారదాశంకరబాబుకు వాస్తవం - దెయ్యాలకథ - చెప్పి, నమ్మించటం అసంభవం! వొకందానరాదు; ప్రాణాల మీదికి వచ్చినా రావచ్చు! వారు నలుగురూ దీర్ఘంగా యోచించి, దహనక్రియలు జరిపామని చెప్పటమే క్షేమమని నిర్ణయించుకున్నారు.

తెల్లవారి కట్టెలు తెచ్చినవాళ్ళతో - "గుడిసెలో కట్టెలున్నవి; మీరు యెంతకీ రాకపోతే, వాటితోనే పనిపూర్తి చేశాము" అని చెప్పారు. ఈ విషయాన్ని గురించి యెవరికీ కించిత్తుకూడా సందేహం కలగలేదు - శవము విలువైన పదార్థం

కాదుగదా మోసగించి యెవరైనా యెత్తుకు పోతారనుకో టానికి !

## 2

అప్పుడప్పుడు జబ్బువొంటిలో జీవించివున్న లక్షణా లేమీ గోచరించనప్పటికీ, బొందెలో ప్రాణము నిలిచి వుండ టమూ, తిరిగి కొంతసేపటికి శవాకారం పడిన శరీరంలో చలనం రావటమూ అందరూ యెరుగుదురు. కాదంబినికూడా నిజానికి చనిపోలేదు; హఠాత్తుగా యేదో కారణంవల్ల ఆమె హృదయ చలనం ఆగిపోయింది.

ఆమెకు తెలివివచ్చి, కన్నువిప్పి చూచింది; నలు వైపులా గాఢాంధకారం! తను యెప్పుడూ నిద్రించే తావు కాదది! ఒకసారి గొంతెత్తి "అక్కా" అనిపిలిచింది. కాని ఆ చీకట్లో యేమీ జవాబు రాలేదు. ఆమె భయపడుతూ లేచి కూర్చుంది; కొన్ని గంటలక్రితం సంభవించిన మృత్యువుసంగతి తలపుకు రాగానే, ఆమెవొళ్ళు జలదరించింది. అబ్బ! హఠా త్తుగా ఆమెగుండెల్లో పెద్దనొప్పి పుట్టుకొచ్చి, వూపిరాడటం లేదు. ఆమె తోడికోడలు యింట్లో వొకమూలన పిల్లవాడికి పాలు వెచ్చగిలబెడుతూవుంది. ఆ బాధ భరించలేక, విరుచు కుని మంచంమీద పడిపోయింది. ఆమె గద్గదకంఠంతో - "అక్కా, బాబును ఒకసారి యిటుతీసుకురా, నా కేమిటో గుండెల్లో బరువుగావుంది" అన్నది.

ఆ పిమ్మట ఆమె కళ్ళకు అంతా అలికినట్టుంది - చూచి వ్రాతపుస్తకంమీద సిరాబుడ్డి వొలికినట్టు! ఇక ఆమె స్మృతి

చైతన్యాలు, సంసారబంధమూ క్షణకాలంలో యేకాకృతి చెందినట్టుంది. తన గారాబుబిడ్డ స్నేహమధుకారాలు వృద్ధి పడుతూ కమ్మని కంఠంతో 'పిన్నీ' అని పిలిచిందీ, లేనిదీకూడా ఆమెకు తిన్నగా గుర్తులేదు. యీ అనంత, అజ్ఞాత మరణ యాత్రాపథంలో చిరపరిచితమైన యిహలోకాన్నుంచి, తన ముద్దుబిడ్డ ప్రేమపూరితమైన పిలుపును దారిబత్తెముగా సంత రించనున్నదీ లేనిది సైతం ఆమెకు జ్ఞప్తిలేదు.

యమలోకం యిలానే స్తబ్ధుగా, అంధకార బంధు రంగా వుంటుందికాబోలు అనుకుంది! అక్కడ చూడతగినది, వినదగినదీయేమీ వుండదు. పనిపాటలేమీవుండవు. సర్వకాల సర్వావస్థల్లో యిలానే చీకట్లో తారట్లాడుతూ వుండాలి!

కొద్దిక్షణాల్లో రయ్యిమని చలిగాలి సాగింది; కప్పల బెకబెకలు విన్పిస్తున్నవి. అప్పుడు ఆమెకు తన క్షుద్రజీవితాన్ని గురించి, తన బాల్యంనుంచీ యిప్పటివరకూ గతించిన వర్ష ఋతువులను గురించీ తలపుకు రాసాగినవి - కాళ్ళకి నేలతగిలి నట్టుంది! ఇంతలో ఆకాశంలో మెరుపుమెరిసింది. ఆ క్షణ భంగురమైన వెలుగులో యెదురుగావున్న చెరువు, మర్రిచెట్టు మైదానము కన్పించినవి. అప్పుడప్పుడు వ్రతాలు వుపవాసాలు చేసినప్పుడు చెరువులో స్నానానికి రావటమూ, అప్పుడు శ్మశానంలోని శవాలనుచూసి, మృత్యువంటే తనకు యెంత భయంకరంగా గోచరించిందీ వొకొకటే గుర్తుకొస్తున్నవి.

ముందు, యింటికి తిరిగివెళదామనుకుంది. కాని 'నేను జీవించి లేను. నన్ను యింటోకి యెలా రానిస్తారు ? వాళ్ళకి అమంగళము కాదూ! జీవరాజ్యంనుంచి నాకు

వువ్వాసన చెప్పారు. 'నేను యిప్పుడు ప్రేతాత్మను!' అని మళ్ళీ అనుకుంది.

కాకపోతే, యీ కటికచీకటి రాత్రి సురక్షితమైన అంతఃపురంనుంచి ఈ శ్మశానంలోకి యెలావచ్చాను? ఇంకా, దహనక్రియలు పూర్తికాని పక్షంలో, బంధువులు యేమయి నట్టు? గదికొక దీపం వెలిగే శారదాశంకరుని భవంతిలో తన చివరిగడియలు తలపుకొచ్చినవి. అంతే, ఆ తర్వాత వూరికి పెడగా అంధకారం దోబూచులాడే ఈ నిశ్శబ్దశ్మశానంలో తను వొంటరిపాటుగా పడివుండి – ఇకను యీ ప్రపంచంలోని మానవసమాజంతో తనకేమీ సంబంధంలేదు. ఇప్పుడు ప్రేతాత్మను! భయంకరమైన దానిని! అశుభమైనదానిని! నావల్ల యెవరికీ యీ ప్రపంచంలో కీడుతప్ప, మేలు జరగదు!

ఆమె మనసులో యీ తలపులు రాగానే సాంఘిక నియమాలు, కట్టుబాట్లు అన్నీ వొకటే తుడిచిపెట్టుకుపోయినవి. ఆమెకు వొక అద్భుతమైన శక్తి, అనంతస్వేచ్ఛ లభించినట్టుంది. ఇప్పుడు తన చిత్తమొచ్చిన తావుకు వెళ్ళవచ్చు; యిష్టమొచ్చి నట్లు నడుచుకొనవచ్చు! మున్నెన్నడూ యెరగని ఈ విచిత్ర భావంకలగగానే, ఆమె వున్మత్తురాలివలె, వొక్క వుదుటున గుడిసెలోనుంచి బయటికి వచ్చి, శ్మశానానికి అడ్డంపడి తుఫాను లాగా దూసుకుపోయింది. ఆమెలో యిప్పుడు లజ్జాభయాదు లకు రవంతకూడా తావులేదు.

నడిచి, నడిచి కాళ్ళు నొప్పులు పెట్టినవి; అలసటగా వుంది. యెంత నడిచినా, అంతూ దరి తోచలేదు. మధ్యలో

పంటచేలు తగిలినవి, అక్కడక్కడ మోకాలిలోతు నీళ్ళు వున్నవి.

తూర్పు తెల్లవారింది, వెలుగురేఖలు కన్పించినవి. అప్పటికి వూరి పొలిమేరన చెట్లమీద పక్షుల కిచకిచలు విన్పించినవి.

ఆమెకు యేదో భయంగావుంది. ప్రపంచంలోని ప్రాణికోటితో యేర్పడిన నూతన సంబంధాన్ని ఆమె గమనించలేదు. ఆ కటికచీకట్లో, శ్మశానంలో వున్నంతసేపూ, ఆమె నిర్భయంగా స్వేచ్ఛారాజ్యంలో వున్నట్టుంది. కాని పగటివెలుగులో ఆ జనపదము చాలా భీతి గొల్పుతూవుంది. మానవుడు-భూతము పరస్పరం భయపడుతుంటారు. యిద్దరూ మృత్యుపథానికి చెరోకవాడ్డునా కాపరం!

## 3

గుడ్డలనిండా బురదకొట్టుకొని, కాదంబిని విచిత్రంగా కన్పిస్తూంది. రాత్రంతా కంటికి నిద్రలేక, మనిషి పిచ్చి అవతారం పడిపోయిఁగది! ఆమె మొహం చూస్తే, పెద్దవాళ్ళకే భయం కలుగుతుంది; ఇక పిల్లలసంగతి చెప్పేదేముంది? దూరంగా పారిపోయి రాళ్ళు రువ్వకుండా వుండరు. అదృష్టవశాత్తు, దారినపోతున్నవొక పెద్దమనిషి, ఆమె స్థితిచూసి, దగ్గరకువచ్చి—"ఎవరమ్మా నీవు? వొంటరిగా వెళ్ళుతున్నావు? పరువు ప్రతిష్టలుగల వంశీకురాలివిగా కన్పిస్తున్నావు?" అని అడిగాడు.

కాదంబిని మాట పలుకలేదు. రెప్ప వెయ్యకుండా అతని మోము వంక చూస్తూ వుంది; వెంటనే జవాబు ఏమని చెప్పాలో తోచలేదు. తను యింకా యీ ప్రపంచంలో సజీవంగావుంది; వసువుప్రతిష్ఠలువున్న వంశస్తురాలుగా కన్పిస్తూంది; దారినపోయే బాటసారి ఏమిటో అడుగుతున్నాడు – యివన్నీ ఆమెకు చాలా విడ్డూరంగా వున్నవి!

బాటసారి మళ్ళీ అడిగాడు – "మీా యిల్లెక్కడ? చెప్పమ్మా, దిగబెట్టి వస్తాను!"

కాదంబిని యోచించసాగింది – "అత్తవారింట తనకు తావులేదు, ఆ ప్రసక్తే అప్రస్తుతం! కన్నవారింటమాత్రం యెవరున్నారు?" అప్పుడు ఆమెకు చిన్ననాటి చెలికత్తె గుర్తుకొచ్చింది. చిన్నతనంలోనే చెలికత్తెలిద్దరూ యెడబాసినారు. కాని వారిద్దరిమధ్య ఉత్తరాలు నడుస్తూనేవున్నవి. అప్పుడప్పుడు ఉత్తరాలలో ప్రేమపోరాటాలు జరుగుతుండేవి. వారిద్దరూ తనప్రేమ గొప్పదని, రెండోపక్షంలో అంతగా ప్రేమ కన్పించడంలేదని వాదు లాడేవారు. ఎప్పుడైనా యిద్దరూ కలుసుకోవడం తటస్థిస్తే, వొకర్ని విడిచి వొకరు క్షణకాలం కూడా కనుమరుగు కావటం అసంభవమనీ పంతాలు పట్టారు.

కాదంబిని ఆ పెద్దమనిషితో – "నన్ను నిశిందాపురం – శ్రీపతిబాబుగారింటికి చేర్చండి!" అంది.

అతను కలకత్తాప్రయాణం! నిశిందాపురం దగ్గరకాదు కాని దారిలోవుంది. అతను స్వయంగా ఆమెను శ్రీపతిబాబు గారింటికి చేర్చే ఏర్పాట్లన్నీ చేశాడు!

చెలికత్తెలిద్దరూ కలుసుకున్నారు. త్వరగా గుర్తించ లేకపోయారుకాని బాల్య సాదృశ్యాలు యిద్దరి నేత్రాల్లో క్రమంగా ప్రతిఫలించసాగినవి.

"ఇవాళ చాలా సుదినం! నిన్ను యింత సునాయాసంగా కలుసుకోగలనని కల్లోకూడా అనుకోలేదు. కాని యెలా రాగలిగావు అక్కా? అత్తవారు వ్రూరుకున్నారా?" అని అడిగింది యోగమాయ.

కాదంబిని కాసేపు వ్రూరుకుని– "అత్తవారిసంగతి నా వద్ద యెత్తవద్దు అక్కా! నీ యింట్లో వొకమూల దాసీమాదిరి పడివుంటానికి కొంచెం జాగాయివ్వు; పనిపాటలన్నీ చేసిపెడతాను." అని చెప్పింది.

"అవేంమాటలక్కా? దాసీమాదిరి వుంటావా! నీవు నా ప్రాణస్నేహితురాలివి–"

అంతలో శ్రీపతిబాబు వచ్చాడు. కాదంబిని కొంచెం సేపు అతనిముఖంవంక చూసి, నెమ్మదిగా గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయింది. కాదంబిని తలమీదకొంగు సరిగా తీసుకోనూలేదు; అతనిని చూసి సిగ్గుపడనూలేదూ!

యోగమాయ తన చెలికత్తెను గురించి భర్త ఏమనుకుంటాడోనని, పరుగెత్తుకువెళ్ళి ఆమె విషయం నచ్చచెప్పసాగింది. కాని అంత అవసరం లేకుండానే, భార్యమాటలన్నీ తేలిగ్గా అంగీకరించాడు. అందుకు యోగమాయ మనసు, యేమంత సంతుష్టి చెందలేదు!

కాదంబిని స్నేహితురాలింటికి రావటానికి వచ్చిందికాని ఆమెతో బాగా కలిసిపోలేకపోయింది, ఆమెదృష్టిలో యిద్దరి

మధ్యా మృత్యువనే అడ్డుగోడ వుంది. మనసులో తనను గురించి యెవ్వరూ వొకవిధమయిన సందేహముతోనూ జాగరూకతతోనూ వుండేవ్యక్తి యితరులతో కలిసిపోవటం దుర్లభం! కాదంబిని చెలికత్తె ముఖంవంకచూసి యేమిటో ఆలోచించుకునేది! ఆమెకు తన చెలికత్తె, భర్తతోటి సంసారం తోటి తనకు దూరంగా మరో ప్రపంచంలో నివసిస్తున్నటుంది. ఆ ప్రపంచంలోనివారు స్నేహమమకారాలకు, విధినిషేధాలకు కట్టుబడివున్నారు. తనుమాత్రం వట్టి ప్రతిబింబం! తన చెలికత్తె వాస్తవ ప్రపంచములో వున్నట్టూ, తను అంతూ దరీ లేని ప్రపంచంలో పడి కొట్టుకులాడుతున్నట్టూ ఉంది.

యోగమాయకూడా అదోవిధంగావుంది. కాదంబిని రహస్యమేమీ ఆమెకు అంతుచిక్కలేదు. స్త్రీలకు రహస్యమంటే గిట్టదు. కారణం, అనిశ్చయాన్ని ఆధారంచేసుకుని కవిత్వం చెప్పవచ్చు; పరాక్రమము చూపవచ్చు; పాండిత్యం ప్రదర్శించవచ్చు - అన్నీ చేయవచ్చు కాని సంసారం సాగించలేరు. అందువల్లనే స్త్రీలు తమకు అర్థంకానిదానిని నామరూపాలులేకుండానో, లేక దానితో యేమీ సంబంధంపెట్టుకోకుండానో తెగతెంపులుచేసుకుంటారు. లేకపోతే దానికి తన చేతులమీదగా నూతనరూపాన్ని యిచ్చి, వుపకరించేటట్టు చేస్తుకుంటారు. యీ రెంటిలో యేదీజరగనివక్షంలో దానిమీద చిరాకుపడతారు ; విసుక్కుంటారు !

సరిగా యిదేజరిగింది. కాదంబిని గడ్డుసమస్యగా మారినకొద్దీ, యోగమాయ లోలోపల చిరాకుపడుతూవుంది. లేనిపోయిన బెడద నెత్తిన తెచ్చిపెట్టుకున్నానే! అదిగాక,

మరో చిక్కువచ్చిపడింది; కాదంబిని తననుచూసి తనే భయ పడుతుంది. తననుంచి తప్పుకుపోయే మార్గ మేముంది? దెయ్యాలు వున్నవనుకునేవారు, తమ నీడచూసి తామే భయ పడుతుంటారు – దృష్టిచేరనితావునే భయంకలుగుతుంది! కాని కాదంబిని యెవరినిచూసోకాదు; తనకుతానుగా భయ పడుతూంది. అందుకనే ఆమె గదిలో యేకాకిగావున్నప్పుడు, మధ్యమధ్య కేకలుపెట్టేది; రాత్రిళ్ళు దీపం వెలుతురులో తన నీడచూసి, ఆమెకు వొళ్లు గగుర్పొడిచేది!

ఆమె స్థితిచూసి యింట్లోవాళ్ళుకూడా వొకవిధంగా భీతిల్లిపోయారు. దాసదాసీలకు, చివరికి యోగమాయకు కూడా – అడపాదడపా దెయ్యాలు కనపడుతున్నవి.

కాదంబిని వొకనాడు అర్ధరాత్రి శోకాలుపెడుతూ, యోగమాయ పడకగదివద్దకువచ్చి – "అక్కా, నీకు దణ్ణం పెడతాను, నన్ను వొంటరిగా విడిచిపెట్టవద్దు" అని చెప్పింది.

యోగమాయకు భయమూ, కోపంకలిగి యింట్లో నుంచి బయటకు గెంటివేయాలనుకుంది. కాని శ్రీపతి జాలి చెంది, అతికష్టంమీద భార్యను శాంతపరచి, కాదంబినికి తన పడకగది నానుకునివున్న మరోగది యేర్పాటుచేశాడు.

మరునాడు యోగమాయ భర్తను వేళకానివేళ అంతః పురంలో వెదికిపట్టుకుని – "అబ్బ. మీరు యేంమనుషులండీ! వొకావిడ అత్తవారిల్లువిడిచి, నెలలతరబడి మీయింట్లో పడి వుంటూవుంది, ఆవిడయింటికి వెళ్తాననేమాటయెత్తదు! మీకు చీమకుట్టినట్టుకూడా లేదేమండీ! అసలు మీ వుద్దేశమేమిటో

కాస్త చెప్పండి. వింటాను. రామరామ! మగవాళ్ళ స్వభావమే యిలాంటిదికాబోలు!" అంటూ నిష్ఠురంగా మాట్లాడింది.

సాధారణంగా పురుషులు, పుట్టుపూర్వోత్తరాలు విచారించకుండానే స్త్రీలవిషయంలో పక్షపాతం చూపుతారు. అందుకు స్త్రీలే పురుషులను యెక్కువ నేరస్తులుగా యెంచుతారు. రూపసి – అసహాయురాలు అయిన కాదంబినిమీద శ్రీపతిబాబు మితిదప్పిన కనికరమే చూపాడు – కాని అలాంటి కనికరమేమీ లేదని యోగమాయమీద ఒట్టుపెట్టుకోటానికి అతను సిద్ధమే, అయినా అతని ప్రవర్తనవల్ల భార్యా అభిప్రాయమే బలపడుతూవుంది.

"అత్తవారు సంతులేని ఈ విధవను దయాదాక్షిణ్యాలు లేకుండా చూసివుంటారు. పావం ఆ చెర పడలేకనే యిక్కడ తలదాచుకుంది. తల్లిదండ్రులు కూడా లేనప్పుడు, యెలా యింటోనుంచి బయటికి వెళ్ళమనేది?" అని శ్రీపతిబాబు అనుకునేవాడు. అందుకనే ఆవిడ మంచి చెడ్డలేమీ విచారించలేదు. కాదంబినిని యిలాంటి విషయాలు అడగటంకూడా అతనికి న్యాయంగా తోచలేదు.

కాని యివన్నీ యెవరికి పట్టినవి? అతనిభార్య మాట మాటకీ సాధిస్తూవుంది. గృహశాంతికోసమైనా, కాదంబిని అత్తవారింటికి, ఆమె యిక్కడ వున్నసంగతి తెలియజేయటం మంచిదనుకున్నాడు. హఠాత్తుగా వుత్తరం వ్రాయటం యెలా పరిణమిస్తుందోనని, తనొకసారి వెళ్ళి రావటానికి నిశ్చయించుకున్నాడు.

శ్రీపతిబాబు రాణీఘాటు వెళ్ళాడు. యోగమాయ కాదంబిని వద్దకు వచ్చి – "అక్కా నీవు యింకా యిక్కడ వుండటం బాగుండదు. నలుగురూ యేమనుకుంటారు?" అంది.

కాదంబిని గంభీరంగా ఆమె మోమువంక చూస్తూ – "నలుగురూ యేమనుకుంటే నాదేంపోయింది?" అంది.

ఆ మాటకు యోగమాయ విస్తుపోయింది. "నీకేమీ పోయేది లేకపోవచ్చు! పరాయి ఆడపడుచును యెన్నాళ్ళని యింట్లో పెట్టుకోము?" అంది మండిపడుతూ!

"నాకు కన్నవారా, అత్తవారా? ఎవరున్నారు?"

యోగమాయ లోలోపల 'నీకు చావయినా వచ్చింది కాదు' అనుకుంది.

కాదంబిని నెమ్మదిగా చెప్పసాగింది – "అసలు నేను మీకు యేమవుతాను? ఈ ప్రపంచంతో నాకేమి సంబంధం? మీరందరూ ఆత్మీయులతో సుఖంగా వుంటున్నారు – నేను మాత్రం కళ్ళు పెట్టుకుని చూస్తుంటాను! మీరు మానవులు, నేను ప్రతిబింబాన్ని! ఆ పరమాత్ముడు మీ మధ్య నన్ను యెందుకు తెచ్చి పడవేశాడో, నాకు అర్థం కాకుండావుంది. మీ ఆమోదప్రమోదాలకు నామూలాన యెక్కడ ముప్పు వస్తుందోనని మీ రందరూ భయపడుతున్నారు. యింతకూ మీతో నాకు వున్న సంబంధమేమిటో బోధపడలేదు. ఆ పరమాత్ముడు తలదాచుకోటానికి మరొక తావు చూపనప్పుడు నే నేం చేయను? అందువల్లనే అన్ని బంధాలు తెగిపోయినా, మీవద్ద పడి వుంటున్నాను.

తన మోమువంక చూస్తూ, కాదంబిని చెప్పిన మాటలు యోగమాయ యెలా భావించిందో! — ఆమెకు విషయం అంతుపట్టక, మారు మాట్లాడలేదు, తర్వాత యేమీ అడగ లేక, భారంగా, గంభీరంగా అక్కడనుంచి వెళ్ళిపోయింది.

## 4

రాత్రి పదిగంటలవుతూంది. శ్రీపతిబాబు రాణీఘాటు నుంచి తిరిగివచ్చాడు. కుంభవర్షం కురుస్తూంది. ఆ వర్షపు మోత వింటుంటే, వర్షం వెలిసేటట్టుగాని, తెల్లవారేటట్టు గాని లేదు!

"ఏమి జరిగిందండీ అక్కడ?" అని అడిగింది యోగ మాయ.

"చాలా సంగతులున్నవి, తర్వాత చెపుతాను" అని, శ్రీపతిబాబు స్నానభోజనాదులు ముగించుకుని, ధూమపానం చేస్తూ పడకగదికి వెళ్ళాడు. మనిషి చింతాక్రాంతుడులా వున్నాడు.

యోగమాయ చాలాసేపు కుతూహలము నిగ్రహించు కుని, గదిలో అడుగు పెట్టగానే—"యేమయిందో చెప్పండి!" అని అడగసాగింది.

"నీవు పొరపాటు చేశావు!"

ఆమాటకు యోగమాయకు కోపంవచ్చినట్లుంది. "ఆడ వాళ్లుపొరబాటు పడటమనేది ఎన్నడూ జరగదు! ఒకవేళ అలా జరిగినా, బుద్ధిమంతుడెవడూ ఆ ప్రసక్తి తీసుకురాడు, ఆ

పొరపాటు తనదిగా స్వీకరించటమే వుత్తమం!" యోగమాయ గునుస్తూ- "ఎలానో కాస్త చెప్పండి, వింటాను" అంది.

"నీవు ఆశ్రియమిచ్చిన వ్యక్తి, కాదంబిని కాదు!"

ఈ మాటకు కోపగించుకోవటం సహజమే. ప్రత్యేకించి తనభర్తనోట విన్నప్పుడు, చెప్పవలసిందేముంది? "మీరు చెప్పితేగాని నా స్నేహితురాలిని ఆనవాలు పట్టలేనన్నమాట! మీ మాటకు నాకు నవ్వొవస్తూవుంది, కోపము వస్తూవుంది. ఏం చోద్యంగా చెపుతారండీ!"

"మనం యిపుడు మాటాడేతీరునుగురించికాదు చర్చిస్తున్నది- నీ చెలికత్తె యెప్పుడో చనిపోయింది. అందులో రవ్వంతకూడా సందేహంలేదు."

ఎంతమహాసొంపుగా చెప్పారు! మీరు ఎక్కడో పొరబాటుపడ్డారు! మీరు యెక్కడికని బయలుదేరి, యెక్కడికి చేరారో, యేమిచెపితే, యేమాలకించారో నమ్మకమేముంది? అసలు మిమ్మల్ని యెవరు వెళ్ళమన్నారు? ఒక వుత్తరం వ్రాసి పడేస్తే, సరిపోయెది కదా?"

తన కార్యసిద్ధికి భార్యకు నమ్మకం కుదరనందుకు, శ్రీపతిబాబు దుఃఖితుడై, యెన్నో ప్రమాణాలు చూపసాగాడు కాని ఫలితమేమీ లేకపోయింది. ఆవుగాములతో పన్నెండు గంటలయింది.

కాదంబినిని తక్షణమే యింట్లోనుంచి సాగనంపటంలో భేదాభిప్రాయమేమీలేదు - కాదంబిని, అసత్యపరిచయంతో తన భార్యను మోసగించిందని శ్రీపతిబాబు వుద్దేశం. కాదంబిని పాలవంటి వంశానికి చిచ్చుపెట్టి వచ్చిందని యోగమాయకు

నమ్మకం – కాని వాదోపవాదాల్లో యెవరూ వెనుదీయలేదు. క్రమంగా యిద్దరి కంఠస్వరమూ తీవ్రమయింది; యిద్దరూ గోడ అవతల కాదంబిని నిద్రపోతున్న సంగతి మరిచిపోయారు.

"నా చెవులార విన్నదికూడా నీవు నమ్మవైతివి!"

"ఎలా నమ్మమంటావు, కంటితో చూస్తూ?" అనేది చృళంగా.

చివరికి యోగమాయ – "అయితే, కాదంబిని ఎప్పుడు చనిపోయిందో చెప్పండి?" అంది.

కాదంబిని తనకు ఉత్తరం వ్రాసిన తేదీకి, ఆమె చని పోయిన తేదీకి తేడా చూపి, భర్త పొరపాటు యెత్తి చూపా లని యోగమాయ లోలోపల అనుకుంది.

శ్రీపతిబాబు చెప్పిన తేదీ ఇద్దరూ లెక్కపెట్టి చూశారు. కాదంబిని వాళ్ళ ఇంటికి చేరిన క్రితంరోజే, చనిపోయింది – యోగమాయ నిలువునా కంపించిపోయింది. శ్రీపతిబాబుకూడా భయపడ్డాడు.

ఇంతలో గది తలుపు తెరుచుకుంది: గాలి విసురుకు గదిలో దీపం పెద్దదయింది. వెలుపలి చీకటిలోనికి జొరబడి, చీకటి గుయ్యారంగావుంది. కాదంబిని వాకిట్లోనుంచి గది మధ్యకు వచ్చి, నిలబడింది. అప్పుడు యించుమించుగా మూడు గంటలు దాటుతుంది. బయట జోరున వాన కురుస్తూంది.

"నేను నీ పూర్వపు చెలికత్తెనే! కాని యిప్పుడు జీవించి లేను, మరణించాను!"

యోగమాయ భయంతో కెవ్వుమంది. శ్రీపతికి మాటా పలుకు లేదు.

కాదంబిని మరల చెప్పనారంభించింది – "నేను చని పోవటంతప్ప, మీకు చేసిన అపకారమేముంది? నాకు ఇహము పరము యెక్కడా తావులేదు. మరి యెక్కడకు వెళ్ళను." అని పెద్దగా చీత్కారంచేసింది – కుండపోతగా కురుస్తున్న ఈ చీకటిరాత్రి బ్రహ్మదేవుని మేల్కొల్పి, "నేను యెక్కడకు వెళ్ళను!" అని నిలతీసి అడిగినట్టుంది.

కాదంబిని ఆ మూర్ఛిత దంపతులను చీకటి గదిలో అలానే విడిచిపెట్టి, ప్రపంచంలో స్థలాన్వేషణకు బయలు దేరింది.

## 5

కాదంబిని రాణీఘాటు యెలా చేరగలిగిందీ చెప్పడం కష్టమే! అక్కడ యెవరికీ కనిపించకుండా, పగలంతా నిద్రాహారాలు మాని పాడుపడిన గుడిలో దాగింది, వర్షాకాలము ఆ కాలంలోనే సందెచీకట్లు ముసురుతున్నవి. గాలివాన వచ్చే సూచనలు కన్పించి, గ్రామస్తులు పెందలకడ ఆదరాబాదరా యిళ్ళకు చేరుకుంటున్నారు. అప్పుడు గుడిలోనుంచి బయలు దేరింది. అత్తవారి గడప తొక్కగానే వొకసారి ఆమెగుండె దడదడ లాడింది. అయినా, ధైర్యం తెచ్చుకుని తలమీద చక్కగా చీరచెంగు సవరించుకొని, లోపలికివెళ్ళింది. దర్వాను దాసీ అనుకుని అడ్డగించలేదు. ఇంతలో గాలివాన ప్రారంభ మయినది.

అప్పుడు గృహలక్ష్మి – శారదా శంకరుని భార్య, ఆడబిడ్డతో పేకాడుకుంటూవుంది. దాసీ వంటింటో వుంది.

జబ్బుపడిన కుర్రవాడు, కొంచెం జ్వరంతగ్గి, నిద్రపోతు న్నాడు.

కాదంబిని యెవరికంటా పడకుండా, తిన్నగా తన 'ముద్దు బిడ్డ' వున్న గదిలోకి వెళ్ళింది. కాదంబిని యేమాలోచించుకుని వచ్చిందో చెప్పలేము. ఆమెకే తెలియదేమో! ఒకసారి తన ముద్దుబిడ్డను కన్నార చూచిపోదామనుకుంది. తర్వాత యెక్కడికి వెళ్ళాలి, యేం చేయాలి అనే తలపు ఆమె మన సుకు రాలేదు.

కటికి లంఖణాలుచేసి, యెముకలు వెళ్ళుకొచ్చిన తన గారాబువట్టి, గుప్పిట బిగపట్టి నిద్రపోతున్నాడు. ఆ కుర్రవాణ్ణి దీపపు వెలుగులో చూడగానే, ఆమె సంతప్త హృదయం తృప్తా ర్తమయినట్టుంది. కష్టాలన్నీ తోసివేసి, వొక్కవర్యా యమైనా హృదయానికి హత్తుకోకుండా యెలా జీవించగలదు? మళ్ళీ తనలోతను అనుకోసాగింది 'నేను లేకపోతే, చూచే దిక్కెవరున్నారు? వాళ్ళతల్లికి, కబుర్లతోటి, పేకాటతోటి కాలం సరిపోతుంది. ఇంతకాలమూ పిల్లవాణ్ణి నా చేతుల్లో పెట్టి, చీకూచింత లేకుండా నిశ్చింతగా వుంది. ఇప్పుడు వాడి ఆలనపాలన కనుక్కునేవాళ్ళు యేరీ!"

పిల్లవాడు అప్పుడే వొకపక్కకు వొత్తిగిలి, ఆ మగత లోకూడా "పిన్నీ మంచినీళ్ళు!" అని పిలిచాడు.

"నా బంగారునాయనే! ఇంకా పిన్నిని మరిచిపోలేదు!" అని, గ్లాసులో మంచినీళ్ళుపోసుకుని, బిడ్డను హృదయానికి హత్తుకుని ముద్దుగా మంచినీళ్ళుపట్టింది.

నిద్రమత్తు వున్నంతసేపు, యెప్పటిమాదిరి 'పిన్ని'చేతి మీదుగా మంచినీళ్ళుత్రాగటం పిల్లవాడికి కొత్తగాలేదు. కాని కాదంబిని తనివిదీర ముద్దులాడి, కుర్రవాణ్ణి నిద్రపుచ్చబోగా, వాడికి మైకంవదిలి, పిన్నిని కావిలించుకుని – "పిన్నీ, నీవు చని పోయావా?" అని అడిగాడు.

"అవును నాయనా!"

"నాదగ్గరకు వచ్చావా? మళ్ళీ చనిపోవుగదూ?"

ఆమె జవాబివ్వబోయేలోపే, వొక విచిత్రం జరిగింది. దాసీ కప్పులో సగ్గుబియ్యంజావతీసుకువచ్చి, కాదంబినిని చూడ గానే, చేతులోని కప్పు జారవిడిచి "అమ్మయ్యో" అని అరుస్తూ, నేలమీద విరుచుకు పడిపోయింది.

ఆ కేకకు యజమానురాలు చేతిలోముక్కలు అవతల పారవేసి, పరుగెత్తుకుంటూ గదిలోకి వచ్చి, కాదంబినినిచూసి, నిర్వోరపోయింది. ఎటూకదలక, అలానే నిలుచుండిపోయింది మాటా – పలుకు లేకుండా!

ఇదంతా చూసి, ఆ కుర్రవాడుకూడా భయపడి ఏడుస్తూ "పిన్నీ, నీవు పో!" అన్నాడు.

చాలాకాలానికిగాను ఆమెకు యివ్వాళ తను చనిపో లేదనిపించింది. అదే ఇల్లూవాకిలి, అదే ఆత్మీయత, అందరూ వొకేమాదిరి సజీవంగావున్నారు – మధ్యలో విచ్ఛేద – వియో గాలేమీలేవు! చెలికత్తె యింటికివెళ్ళి, చిన్ననాటి తాను జీవించలేనని ధృవపరచుకుంది కాని తన 'బంగారు తండ్రి'వద్దకు వచ్చి, 'పిన్ని' సజీవంగా వున్నదని తెలుసుకుంది.

"అక్కా, నన్ను చూసి అలా భయపడతారు దేనికి? పరిశీలనగా చూడండి, నేను ఈ యింటి కోడలినే! ఇప్పటికీ అలానే వున్నాను!" అని చెప్పింది వ్యాకులపడుతూ.

ఆ యిల్లాలు నిలబడలేక, తెలివితప్పి పడిపోయింది.

ఇంతలో శారదా శంకరబాబుకు చెల్లెలిద్వారా ఈ కబురందింది, అంతఃపురానికి పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆయన కాదంబినికి చేతులు జోడించి – "అమ్మాయి, నీకిది న్యాయమేనా? మన వంశతారకుడు యీ నలుసు, సతీశు వొక్కడే గదా! వీడిమీదికి నీ దృష్టి మలిపావు దేనికమ్మాయి? మే మేం పరాయివాళ్ళమా, చెప్పు? నీవు చనిపోయిన నాటి నుంచీ పిల్లవాడు యెండుకు పోతున్నాడు, జబ్బు యింతవరకు తగ్గుముఖంపట్టలేదు రాత్రింబవళ్ళు 'పిన్నీ' అని వొకటే కలవరిస్తున్నాడు. దేహయాత్ర చాలించినదానికి మళ్ళీ వృథాగా యీ మమకారం దేనికి? మమ్మల్ని వదులు, నీకు పిండదానం సమర్పించి, సముచిత సత్కారాలు చేస్తాము!" అని చెప్పాడు

కాదంబిని యికను సహించలేక, తీవ్రస్వరంతో "–నేను చనిపోలేదు, ముమ్మాటికి చనిపోలేదు. అబ్బ! నేను మీకు యెలా నచ్చచెప్పను, యిటుచూడండి, నేను బ్రతికేవున్నా" నని, చేతికి అందుబాటులోవున్న పూలగిన్నెతీసుకుని, తలకు కొట్టుకోసాగింది. తలపగిలి, రక్తంవరదలయింది. ఆమె తన నెత్తురుచూపి – "చూడండి, నేను బ్రతికివున్నాను!" అంది.

శారదాశంకరబాబు కొయ్యబారిపోయాడు. కుర్రవాడు భయంచేత గాబరాపడిపోయి – "నాన్నా, నాన్నా" అని పెద్ద

పెట్టున యేడవసాగాడు. ఆడవాళ్ళిద్దరూ తెలివితప్పి పడి వున్నారు.

"నేను చనిపోలేదు. చనిపోలేదు" అనిఅరుస్తూ, బయటికివచ్చి, మెట్లుదిగి, అంతఃపురంలోని కోనేరులో దూకింది కాదంబిని.

శారదాశంకరబాబు వున్నగదిలోకి, యెవరో కోనేరులో దూకిన శబ్దం వినిపించింది.

ఆ రాత్రి వర్షం తెంపులేదు.

మరునాడు మధ్యాహ్నందాకా, వాన వెలియలేదు, తుపర పడుతూనేవుంది.

కాదంబిని యిలా 'తను చనిపోలే'దని, ప్రాణాలర్పించి, ఋజువు చేసుకుంది!

—